# కోణార్క



డా॥ శోభరాల సత్యనారాయణ
యం.ఏ., పి. హెచ్. డి.,

శ్రీ విశ్వకర్మ విజ్ఞాన కేంద్రం
శ్రీకాకుళం - 532 001

K O N A R K A

Dr. Sobhiraja Satyanarayana





ప్రచురణ : ఫిబ్రవరి 2001

ప్రతులు : 500

మూల్యము : 20/-

ప్రతులకు :

శ్రీమతి శోభిరాల బాలాత్రిపురసుందరి
G. F. 3, అలంకృత అపార్ట్‌మెంట్స్,
పటమటలంక
విజయవాడ-14

సంచాలకులు,
విశ్వబ్రాహ్మణ ధర్మపీఠం
4-1-11, విశ్వకర్మ భవనం
తిలక్ రోడ్, బొగ్గులకుంట
హైదరాబాద్ - 500 001

ప్రఫుల్ల చంద్ర
2-3-36, కళాప్రపూర్ణ భవనం
గాంధీనగర్, తెనాలి.

ముద్రణ :
వాణీ ఆర్ట్ ప్రింటర్స్, తెనాలి. ఫోన్ : 24019

# అంకితము

కృతికర్త ఆకాంక్ష మేరకు
వారి అత్తమామలు, నా జననీ జనకులు
కళాప్రపూర్ణ, దర్శనాచార్య
**శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు**
వారి ధర్మపత్ని, ప్రేమమయి
**శ్రీమతి రాజరాజేశ్వరీదేవి** గారల
దివ్య స్మృతికి
సభక్తికముగా

— శోభిరాల బాలాత్రిపురసుందరి

# సకలాంజలి

ఓం ఐం హ్రీం శ్రీం

సకలాయై నమః

*　　　*　　　*

సకల జగజ్జనయిత్రిని
సకలాధిష్ఠాన రూప సర్వాధారన్
సకల మనోన్మణి సమరస
సకలేష్టద శాస్త్రసార సన్నుతిఁ జేతున్.

కంజలోచన కమనీయ కారయిత్రి
కంబుకంఠి కలాలాప కావ్యలోల
కర్మఫలదాత్రి కామేశి కల్పవల్లి శ్రీ
కరుణ మ మ్మేలు గాత విజ్ఞాన కలన.

లక్షణోజ్జ్వల దివ్యాంగి లబ్ధరూప
లబ్ధనానాగమస్థితి లబ్ధభోగ
లక్షకోట్యండనాయిక లలిత మాకు
లబ్ధసంపత్సమున్నతి లభ్య మగుత

హ్రీంకారాంగణదీపిక
హ్రీంకారసువర్ణసౌధశృంగకపోతిన్
హ్రీంకారాధ్వరదక్షిణ
హ్రీంకారేశ్వరిఁ దలంతు హృత్కమలమునన్.

— శోభిరాల

# కావ్యరూప 'కోణార్క' శిల్పి శ్రీ శోభిరాల

'సాహిత్యబ్రహ్మ'

**డా. వి. వి. యల్. నరసింహారావు**

పురాసంచాలకుడు, రాష్ట్రీ కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖ

భారతీయ మహాశిల్పానికి ప్రత్యక్ష నిదర్శనంగా కనిపించేవి ఇక్కడ వేలసంఖ్యలో వెలసిన విశిష్ట దేవాలయాలు. విదేశ యాత్రికు లెవరు వచ్చినా వారిని ప్రప్రథమంగా ఆకర్షించేవి దేవాలయాలే; ఆ ఆలయాల్లో నిక్షేపించబడిన అద్భుత శిల్పసంపదే.

ఇటువంటి దేవాలయాల్లో గణనీయమైంది కళింగ దేశంలోని కోణార్క దేవాలయం. కళింగగాంగ ప్రభువుల్లో ఒకడైన నరసింహ దేవగాంగుని సంకల్పంతో శిల్పిశ్రేష్ఠుడైన విశుమహారాణా ప్రజ్ఞా పాటవాలతో వెలసిన సూర్యదేవాలయం అది.

పద్మక్షేత్రంలో వెలసిన సూర్యదేవాలయం ఇసుక నేలలో కట్టవలసివచ్చింది. అటువంటి రాజీవక్షేత్రంలోనే కట్టవలసివచ్చిన అర్కదేవాలయాన్ని మహాప్రతిభాశాలి, సర్వశాస్త్ర కోవిదుడు అయిన విశుమహారాణా అనేక శిల్పుల్ని నియోగించి అపూర్వంగా నిర్మించాడు. నిర్మాణకార్యక్రమానికి పదిరెండుసంవత్సరాలు పట్టింది. కాని ఎక్కడ ఏ శాస్త్రసంబంధమైన కించిద్దోషం ఏర్పడిందో కలశారోపణ కష్టమైపోయింది. ఎంత గొప్ప శిల్పంతో నిండినదైనా కలశ ప్రతిష్ఠ జరుగని దేవాలయానికి పరిపూర్ణత ఉండదు గదా !

జగద్విఖ్యాతుడు, దివ్యశక్తిసంపన్నుడు అయిన విశుమహారాణా నిర్విణ్ణుడై నిలిచిపోయాడు. రోజులు, నెలలు, సంవత్సరాలు గడిచి పోతున్నాయి. అన్నట్లు నరసింహదేవగాంగు ఒక పెద్ద యుద్ధంలో శత్రువులతో పోరాడేందుకు వెళ్ళాడు. దుర్బుద్ధి అయిన మంత్రి అదే అదనుగ రాజును తానే అంతమొందించేందుకు కుట్ర పన్ని సింహాసనం ఆక్రమించే ప్రయత్నంలో ఉన్నాడు. రాజాభిమానులైన శిల్పులు కూడ అతని దృష్టికి అశక్తులుగా కనపడసాగారు. 'కలశ ప్రతిష్ఠ చెయ్యగల శిల్పి లేడా ? ఆ మాత్రం చెయ్యలేని శిల్పులు ఎందుకు శిక్షార్హులు కారాదు ?' - ఇదీ మంత్రి ధోరణి.

అనుకోకుండా అక్కడ ప్రత్యక్షమయినాడు ఒక యువశిల్పి. శిల్పశాస్త్ర పాండిత్యంలో దేవాలయ నిర్మాణములో తలపండిన, చేయితిరిగిన మహాశిల్పుల మధ్య ముప్పదేండ్లు నిండని ఈ యువశిల్పి నిలిచి, నేర్చిన శాస్త్రాన్నీ గడించిన అనుభవాన్నీ నెమరువేసుకొని కలశప్రతిష్ఠకు పూనుకొన్నాడు. దేవాలయం అన్ని హంగుల్తో అద్భుతంగా వెలసింది.

'ఇంతకూ ఈ యువశిల్పి ఎవరు ? ఎవరైతేనేం ? ఇన్నేళ్లు పండిన అనుభవంతో నేను చెయ్యలేని కలశప్రతిష్ఠ ఇతడు చేశాడు.' విశుమహారాణా యువశిల్పిని ప్రేమవాత్సల్యాలతో పరిష్వంగం చేసుకున్నాడు. ఆ పరిష్వంగసుఖం పుత్రగాత్ర పరిష్వంగ సుఖంవలె అతని కెంతో ఆనందం కలిగించింది.

విశుమహారాణాకు తన ఏకైక పుత్రుడు ధర్మపదుడు జ్ఞప్తికి వచ్చాడు. చిన్నతనంలోనే తన దగ్గర శిల్పాది విద్యల రహస్యాలు

తెలుసుకున్నాడు. తన భార్య చంద్రలేఖ జ్ఞప్తికి వచ్చింది. దంపతులు పుత్రుణ్ణి ఎంత అల్లారుముద్దుగా పెంచుకొన్నారో జ్ఞప్తికి వచ్చింది. పదహారేండ్లు నిండని పసరుప్రాయంలో ఇల్లువిడిచి బాహ్యప్రపంచం లోకి ఇంకా ఇంకా విద్యల రహస్యాలు తెలుసుకోవాలని ఆరాట పడ్డాడు. ఇల్లు విడిచిపోయేందుకు తండ్రి అనుమతి కోరాడు. తండ్రిగా తాను పుత్రుని కోరిక నంగీకరించలేకపోయాడు విశుమహారాణా. ధర్మపదుడు తెల్లవారకముందే తలిదండ్రుల పాదాలకు నమస్కరించి వెళ్ళిపోయాడు. ఇప్పటికి పదిరెండు సంవత్సరాలు గడిచాయి. "ఆ ధర్మపదుడు - నా ఆరోప్రాణం - వాడేమైనట్లు ?"

వాడు వీడు కాడుగదా ! కలశస్థాపనలో ఇంతటి కుశాగ్రబుద్ధి ఎవరికుంటుంది ? అనుమానం లేదు. ఈ ఆగంతుక యువశిల్పి మా ధర్మపదుడే.

వాడి కోసం వెదికాడు. కనపడలేదు. ఒక దుర్వార్త విని పించింది. ఏండ్లతరబడిగా కలశస్థాపన చెయ్యలేని శిల్పుల్ని అందర్నీ - అంటే పన్నెండు వందలమందిని - విశుమహారాణాతో పాటు కుటిల మంత్రి కారాగారంలో బంధిస్తానన్నాడు. ప్రాణాలు తీసినా తియ్య వచ్చు.

తాము చెయ్యలేని పనిని ఒక యువశిల్పి చేయగలిగి నందుకు అతనికే మంత్రి శిల్పిరాజ్యపట్టాభిషేకం చేస్తాడు. దానిని భరించ లేని శిల్పులు యువశిల్పిని రామచండికాదేవికి బలియివ్వాలని నిశ్చ యించుకొన్నారు. అది పసిగట్టి యువశిల్పి "వారు నన్ను బలియివ్వడం

ఏమిటి ? దేవి ప్రీతి కోసం నన్ను నేను బలియిచ్చుకోలేనా ? ఇంత మంది శిల్పుల ఆనందంకోసం నన్ను నేను ఈ సముద్రునకు అర్పణ చేసుకుంటా" అంటూ తనువు చాలించాడు యువశిల్పి.

ఈ దుర్వార్త శిల్పిలోకానికి తాత్కాలికంగా ఆనందం కలిగించినా, పుత్రవియోగక్లిష్టుడైన విశుమహారాణాను దుఃఖ సముద్రంలో ముంచింది. కాదు-మహాసముద్రంలోనే ముంచింది. కొడుకును కలుసుకునేందుకు కొడుకు దారినే అనుసరించి సముద్రంలో కలిసి పోయాడు. అట్లా కలిసిపోయే ముందు పుత్రవియోగదుఃఖం అతని చేత ఒక ఘోరశాపం ఇప్పించింది.

ఏ దేవాలయ నిర్మాణం కోసం సతీసుతులను దూరంచేసుకొని రాత్రింబవళ్లు శ్రమించినా ఫలం కలుగలేదో - ఆ దేవాలయం - ఆ కోణార్క దేవాలయం-పూజాపురస్కారాలు లేకుండా "భూకంపము వచ్చి వ్రయ్యలగుగాక సమస్తము నాశనంబుగా" అని శపించాడు.

అంతటి వివేకశాలి అయిన మహాశిల్పికూడా పుత్రశోకంతో సూర్యదేవాలయాన్నే శపించాడు.

అందుకే కాబోలు కోణార్క దేవాలయం పర్యాటక యాత్రా స్థలంగా మిగిలిపోయిందే తప్ప నిత్యపూజలందుకోలేక పోయింది. విషయం తెలుసుకొన్న నరసింహదేవగాంగు తానే స్వయంగా దేవాలయంలో విగ్రహప్రతిష్ఠ ఆపుచేయించాడట

కోణార్క దేవాలయ విషాదచరిత్ర ఇది.

చారిత్రకంగా - కోణార్క దేవాలయ నిర్మాణం క్రీ. శ. 1242 ప్రాంతంలో పది పన్నెండు సంవత్సరాలు జరిగినట్లు తెలుస్తుంది. కడపటి గాంగులలో మొదటి నరసింహదేవగాంగు రాజ్యకాలం 1238 నుండి 1264 వరకు - దాదాపు 27 సంవత్సరాలు. ఈ రాజు తల్లి సూర్యభగవాను నారాధించి ఈ పుత్రుని గన్నది. ఆ తల్లి ఆదేశం వల్ల ఆమె జ్ఞాపకార్థమే ఈ సూర్యదేవాలయము నరసింహదేవగాంగు నిర్మింపజేశాడు.

సప్తాశ్వుడైన సూర్యుని రథాకృతితో నిర్మించబడ్డ దేవాలయం ఇది. ఉత్తరాయణ దక్షిణాయన ప్రభావం లేకుండా సూర్యకిరణాలు నేరుగా మూలవిగ్రహంమీద పడేటట్లు నిర్మించాడు విశుమహారాణా.

'విశు' శబ్దానికి మనుష్యుడని కూడా అర్థం. "మహారాణా" అన్నది ఉత్కల ప్రాంతంలో నేటికీ విశ్వకర్మీయులైన వారి పేరు చివర ఉంటుంది. 'విశ్వమానవ తత్వానికి ప్రతీకగా నిల్చిన విశ్వ కర్మీయమహాశిల్పి' అని, 'విశుమహారాణా' కు అర్థం. ఆ మహాశిల్పికి అది అక్షరాల సార్థకమైన పేరు.

ఈ మహాశిల్పి కథను ఒక మహాకవితాశిల్పి కావ్యరూపంగా అందించి కన్నుమూశాడు. ఆతడే కీ. శే. బ్రహ్మశ్రీ శోభిరాల సత్యనారాయణగారు, 'విశ్వజ్ఞ' బిరుదాంచితుడు.

కావ్యంలో పద్యాలన్నీ కలిపినా 204 కంటే ఎక్కువ లేవు. అయినా మహాకావ్య లక్షణాలను అపురూపంగా పొదువుకొన్న భవ్య కావ్యం "కోణార్క". ఉత్తర దక్షిణాయన కోణ నిమిత్తం లేకుండా

సూర్యకిరణాలు నేరుగా వచ్చి విగ్రహంమీద పడేట్లు నిర్మించబడిన దేవాలయం కనుక ఇది కోణార్క దేవాలయం. ఆ దేవాలయంలోని మహాశిల్పం ఈ కావ్యంలోని పంచమప్రకరణమైన "శిల్పదర్శనం"లో కరువుతీరా చూడవచ్చు.

కథాగతి ననుసరించి కరుణశోకాలతో కొనసాగుతూ శాంతంలో పర్యవసించే 'కోణార్క' కావ్యాన్ని శోభిరాలవారు రసనిర్భరంగా రూపొందించారు.

కావ్యాంగాలైన శబ్ద వాక్య విద్యా కళావిశేషాలు కుప్ప వోశారు శోభిరాలవారు. మహాకవి కావ్యాన్ని ఎలా తీర్చిదిద్దుతాడో పండితరాయలు ముక్తకంఠంతో చెప్పాడు.

> "న తచ్ఛబ్దం నతద్వాక్యమ్ । న సా విద్యా న సా కళా
> జాయతే యన్న కావ్యాంగమ్ । అహోభారో మహాన్ కవేః ॥

శోభిరాల సుకవి రసగంగాధరుడువలె ప్రత్యక్షమౌతాడీ కావ్యంలో.

అధ్యేషణ, నృపస్యంతి, పత్రరథం, ప్రసితి, ప్రమితి మొదలైన శబ్దాలు అవలీలగా సార్థకంగా ప్రయోగించిన సత్కవికి గల శబ్దాధికారం మనం అవలీలగానే ఊహించుకోగలం.

అంతే కాదు; రసానుకూలచ్ఛందః ప్రయోగంలో కూడా ఈ కవికి గల సామర్థ్యం శ్లాఘాపాత్రం. వైదికసూక్తుల్ని యథాతథంగా పద్యంలో ఒదిగించటం నల్లేరుమీద బండినడకగా సాగింది శ్రీ శోభిరాలకు.

కం. రవిమందిర రచనోద్యమ
మవితథముగ స్థపతివరులు "యఇమా విశ్వా
భువనాని జుహ్వ" దితి మం
త్రవిధిన్ జేసిరట వాస్తుదైవతపూజల్.

తే. గీ. "ఓం నమో విశ్వదేవాయ ! ఓం నమః
ప్రభాకరాయ । మిత్రాయ ! దివాకరాయ !
కాల రూపాయ ! సవితాయ ! కామదాయ !
ఓం నమో భాస్కరాయ ! తుభ్యం నమోస్తు.

తెలుగుపద్యం ఆద్యంతం ఇంత హాయిగా సంస్కృతమంత్రాన్ని పొదువుకొన్న సందర్భాలు తెలుగుసాహిత్యంలోనే అరుదు.

వైదికాచారసంపత్తి బహిరంతరంగాల్లో అపూర్వంగా పొదువుకొన్న విశ్వకర్మీయ మహాశిల్పి విశుమహారాణామూర్తిని మన కన్నెదుట నిల్పిన శోభిరాలమూర్తిచిత్రణ సామర్థ్యం ప్రశంసాపాత్రం. చూడండి.

సీ. బ్రహ్మతేజస్సు రాపాడువర్చస్సుతో
కమనీయ భూతి పుండ్రములతోడ
రమణీయ రుద్రాక్షమాలికలతో
ధవళ యజ్ఞోపవీతములతోడ
క్రమమైన పింజెసీర్కావి దోవతితోడ
హరువైన యుత్తరీయంబు తోడ
అచ్ఛాచ్ఛ జలపూర్ణమగు కమండలువుతో
తమ్రిదుంచు కుఱుచలాతాము తోడ

ఆ. వె. పిలకజుట్టుతోడ వెనువెంటఁ జనుదెంచు
బ్రహ్మచారి శిష్యవరులతోడ
వేదపాఠములను స్వాదుస్వరాలతో
వల్లెవేసి కొనుచునచ్చుచుండు.

వేదోపనిషత్తులు జ్యోతిషసాముద్రికాలు, మంత్రతంత్రములు సాహిత్యలక్షణ గ్రంథాలు, వాస్తుశిల్ప స్థాపత్యవేదాదులు ఆపోశనం పట్టిన సర్వజ్ఞుడు విశుమహారాణా.

అందాలప్రోవు అర్ధాంగి చంద్రలేఖపై అతనికి గల ప్రేమ, అద్భుత ప్రతిభా పాండిత్యఖని యైన కుమారుడు ధర్మపదునిపై గల వాత్సల్యం, ప్రభుభక్తి పరాయణత, దుర్మంత్రిపై గల అసహ్యభావం అన్నీ కలిసి పూర్ణమానవుడుగా వెలసిన విశుమహారాణా సార్థక నాముడు. అతని పాత్ర మాత్రమేకాక కావ్యంలోని పాత్రలన్నింటిని సమర్థతతో నిర్వహించిన ప్రజ్ఞాశాలి 'విశ్వజ్ఞ' కీ. శే. శోభిరాల సత్యనారాయణగారు; ఇప్పుడు మనమధ్య లేరు.

'రాగమయి' వంటి ఉత్తమ పద్యకావ్యాలు రచించి, మహా భారతాంతర్గత శిల్పశాస్త్ర రహస్యాలు పరిశోధించి గణనీయ కవి పండితుడుగా వన్నెవాసి గన్న డా. శోభిరాల సత్కృతులు మహా జనానికి పరిచయం చేసే అవకాశం నాకు గల్గించిన శ్రీమతి శోభిరాల బాలాత్రిపురసుందరిగారికి కృతజ్ఞతలు. భర్తృసంసర్గంలోను పితృ సన్నిధిలోను * ఎన్నో సాహిత్యరహస్యాలు స్వప్రయోగంగా నేర్చిన త్రిపురసుందరిగారికి ఈ కావ్యముద్రణ భర్తృవియోగ విచారం కొంతవరకైనా ఉపశమింపజేయగలదు.

తథాస్తు

హైదరాబాదు }
3-6-2000 } - వాసిలి వేంకట లక్ష్మీనరసింహారావు

* దర్శనాచార్య కళాప్రపూర్ణ డా. కొండూరు వీరరాఘవాచార్యులుగారు

# సమ్యక్ దర్శనము

సాహిత్య విద్యాప్రవీణ, భాషా ప్రవీణ - కవిశేఖర -
సుకవి సుధాకర - ద్వివార రాష్ట్రస్థాయి అవార్డు
(పద్య కవిత్వములో) గ్రహీత - విశ్రాంత ఆంధ్రోపన్యాసకుడు
**బూరుగల గోపాలకృష్ణమూర్తి**

"ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్" అనునది యొక కర్మప్రబోధక వాక్యము - అనగా ఆరోగ్యము సరిగా లేనివారు సూర్యభగవాను నారాధించిన ఆరోగ్యవంతులగుదురని యా వాక్యభావము.

దేశములో దేవతలకు వాడవాడల పల్లెపల్లెల దేవళములున్నవి.

"ఆరోగ్య మేవ మహాభాగ్యమ్" అనునది కూడ యొక మంచి నీతివాక్యము.

ఎన్ని భాగ్యములున్నను ఆరోగ్యము లేనివాని కవియన్నియు నిరుపయోగములే కదా. అందువలన పై వాక్యము అర్థవత్తరము - అటువంటి ఆరోగ్య మహాభాగ్యము ననుగ్రహించువాడు సూర్య భగవానుఁడే గదా - మఱి యట్టి భాస్కరస్వామికి గుడిగోపురములు లేకపోవుట యేమి ? అది దేశమునకే గొప్ప లోటు కదా !

దేశములో ఆ ద్వాదశమూర్తి లేని లోటును దీర్చినదే కోణార్క దేవాయతనము - అది యీనాడు జగత్ప్రసిద్ధము.

కోణార్క దేవాలయ నిర్మాణ విషయమును "విద్యా వినయేన శోభతే" అను సుభాషితమున కాశ్రయుఁడైన చిరంజీవి వి.వి.యల్.

నరసింహారావు ముచ్చటగా ముచ్చటించి నాకా పనిలేకుండ చేశాడు-సంతోషము.

ఒకనాఁడు కవితలల్లువారు వ్రేళ్లమీద నుండెడివారు. ఈనాఁడు వేలమీద నున్నారు. వారిలో సానఁదీరిన మేలిరత్నములు పదుల సంఖ్యలోనే యున్నవి - ఆ రత్నములలో నొకటియే శోభిరాల రత్నము.

శోభిరాల వారి వంశము కవిరత్నఖని - మఱి యందులో ఉత్తమరత్నము లుద్భవింపక యెట్లుండును ?

శోభిరాలవారి సతీపిత కీ॥ శే॥ కొండూరు వీరరాఘవాచార్యులు గారు - బహుగ్రంథద్రష్ట - బహుగ్రంథకర్త.

కవిగారి యింటిపేరు శోభిరాలవారు - పేరు సత్యనారాయణ. కవిగారి యింటిపేరు శోభిరాలవారు కాదు - శోభరాలు వారని నా యభిప్రాయము - ఎందువలననగా వారి రచనలో ఏ పద్యమును ముష్టిబద్ధము చేసినా (పిండినా) దానిలో నుండి కావ్యశోభలు రాలుచు ఉంటాయి గదా.

"కోణార్క" యను ఈ కావ్యము సత్యనారాయణగారి యనల్ప కల్పన సృష్టి - కావ్యము చిన్నదైనను ప్రతిభ గొప్పది - అరుణుని కిరణమణురూపమైనను దాని పరిణతి అపరిమితము గదా !

కావ్య నిర్మితికి దోహదము చేయునవి మూఁడంశములు : వ్యుత్పత్తి, అభ్యాసము, ప్రతిభ.

ఈ త్రికములో మొదటివి రెండును ప్రయత్న సాధ్యములు మూఁడవది దైవదేయము.

ఈ మూడంశములు కోణార్క కావ్యములో ప్రస్ఫుటములు - అందువలననే ఈ కావ్యము త్తమ కావ్యము.

కోణే - సముద్రతీర కోణే, (అంచున) స్థితః, అర్కః - అర్క దేవాలయః - సముద్రపు టంచున నున్న సూర్య దేవాలయము - అని కోణార్క సమాసమునకు విగ్రహవాక్యము ఇచ్చుట - 'అర్క' శబ్దము - అర్క దేవాలయమున కుపలక్షకము.

"సాలంకారే శబ్దార్థే కావ్యమ్" అని కావ్యమర్మజ్ఞ నిర్వచనము - అలంకారములు కావ్యసౌందర్య హేతువులు. నిరలంకారమైన కావ్యము శోభింపదు - కోణార్క దివ్యాలంకార సుందరము అందులకొక మచ్చుతునక.

ఆ కళింగ గంగాన్వవాయాబ్ధి యెలమి
పొంగిపొరలగ రాజుగాఁ బుట్టినాఁడు
కువలయానందకరముగా గొనబు మీఱ
ధీవిశాలుఁడు నరసింహ్వా దేవగాంగు.

ఈ పద్యమున శ్లేషాలంకారమున్నది - రూపకమునకు నిందు తావున్నది. రాజు, కువలయము అను పదములు శ్లేషను ఆశ్లేషము చేసికొని మనోహరమైన యర్థాంతరమును స్ఫురింపఁజేయుచున్నవి.

సముద్రమునకు ఆహ్లాదము కలుగునట్లుగా చంద్రుడుదయించి కలువలను రంజింపజేయుచున్నట్లే -

నరసింహభూపతి, తన కులవృద్ధులు సంతోషించునట్లుగా వారి వంశమునఁ బుట్టి పుడమి పురంధ్రిని తన ధర్మపరిపాలనముతో ఆనందింపజేయుచున్నాఁడు - అని భావాంతరము.

ఈ గ్రంథమునకు తలమానికము, కోణార్క శిల్పవర్ణనము - ఈ వర్ణనములలో శిల్పకళ పరాకాష్ఠత నందినది - నవరసములు ఈ వర్ణనములలో నివాస మేర్పరచుకొన్నవి. ఆధ్యాత్మిక చింతనము, సామాజిక పరిస్థితి - సందేశములు - ప్రబోధములు మొదలగు నెన్నియో విషయములు ఈ వర్ణనములలో మనకు దర్శనమిస్తాయి - రసరాజమైన శృంగారమునకొక మూదల.

"ప్రణయవతి యొర్తు చేత దర్పణము బూని
కొసరి కయిచేసికొను చటఁ గూరుచుండె
ఇఁత ప్రొద్దాయె నేల రాఁడింతవఱకు
వల్లభుండని మదినెంతొ వగచుచుండె"

ఇది మనోజ్ఞమైన శృంగారనాయికా వర్ణనము - ఆ నాయిక పేరు వాసకసజ్జిక.

ప్రియుని రాకను దెలిసికొని కేళీగృహమును చక్కగా తీర్చి దిద్ది తాను చక్కగా అలంకరించుకొని ప్రియుని కొఱకై నిరీక్షించు చుండుట వాసకసజ్జికా లక్షణము.

ఈ పద్యమును జదువగానే విరహాతప్తయైన వాసకసజ్జిక మన కనులముందు నడయాడక మానదు.

పరోక్ష దృశ్యమును తన కవిత్వము ద్వారా పాఠకులకు ప్రత్యక్షము చేయఁగలిగిన వాఁడే మహాకవి.

బహుగ్రంథములు పరిశీలించిన మహాకవికి, కొన్ని సందర్భము లలో స్వీయరచనలో అన్యకవి వృషభుల రచనలోని పోలికలు కొన్ని యాదృచ్ఛికముగా, అప్రయత్నముగా చోటుచేసికొంటూ ఉంటాయి.

అది దోషము కాదు ప్రత్యుత, బహుగ్రంథపఠనలబ్ధ విజ్ఞాన ఫలితమే అవుతుంది - అందువలన నది గుణమే.

సత్యనారాయణగారు శిల్పిబ్రహ్మ యాకారమును ప్రవృత్తిని ఈ విధముగా వర్ణించినారు.

సీ॥ బ్రహ్మతేజస్సు రాపాడు వర్చస్సుతో
కమనీయ భూతి పుండ్రములతోడ
రమణీయమైన రుద్రాక్షమాలికలతో
ధవళయజ్ఞోపవీతముల తోడ ...
శిల్పి వచ్చినాడు.

ఈ పద్యము, మనుచరిత్రములో పెద్దన మహాకవి సిద్ధుని వర్ణించు పద్యమును బోలియున్నది చూడండి.

అరకూటచ్ఛాయ నవఘుళింపఁగ జాలు
బడుగు దేహమ్మున భస్మమలది
విణేయమైనయొడ్డాణమ్ముమలవణితో
అక్కళించిన పొట్టమక్కళించి
కకపాల కేదార కటకమ్ముదితపాణి
కుఱుచలాతాముతోఁ గూర్చిపట్టి
సిద్ధుడు వచ్చెను.

"గతాను గతికోలోకః నలోకః పారమార్థికః"
లోకులు పదిమంది యన్నదా నినే యదార్థము

గా పరిగణింతురు గాని ధర్మాధర్మములను నిశితముగా బరిశీలింపరు. అధర్మమునకే పట్టము కట్టెదరు. ఈ విషయము నీ కవిశేఖరుఁడు వ్యంగ్యముగా విమర్శించినాఁడు - గమనించండి.

"తన వాఁడెవ్వఁడో, కాని వాఁడెవఁడో, మైదానమ్ములో గాఢ ని
ద్రను బన్నుఁడినవేళఁ గాముకుఁడు దుర్మార్గుండెవండో సిశీ
థిని, సౌందర్యముఁ గొల్లఁగొట్టె, నవనీతిన్ మాన్ప రెవ్వారుఁ గాం
తనె, దూషింతురు, సర్వమానవులు, నన్యాయంబుగా మూర్ఖులై.

శ్లో॥ "బలాద్దత్తం బలాద్భుక్తం బలాద్యచ్చాపి లేఖితమ్
కృతమప్యకృతం చాహుః ధర్మజ్ఞాః సూక్ష్మదర్శినః

"మనుస్మృతి"

తన కేమాత్ర మిష్టము లేక బలాత్కారముగా స్త్రీ, దుష్టుని చేత ననుభవింపఁబడినను ఆమె పతిత కాదు. ఆ దోషము ఆ కామాంధునిదే - కాని, అజ్ఞలోకము ఆ దోషమును అబలకే యంటగట్టి యామెనే దూషించుచున్నది - ఇది యెంత అన్యాయము బలాత్కృత మహిళ పతిత గాదని మనుధర్మశాస్త్ర ముద్ఘోషించు చున్నను దాని నెవ్వరు పాటింపరు.

ఈ ధర్మసూక్ష్మమును సత్యనారాయణగారు తన పద్యము ద్వారా తెలుపుచు అజ్ఞానలోకమును హెచ్చరించుచున్నారు - ఎంతటి వ్యంగ్య ప్రబోధమిది?

ఈ కావ్యనిర్మాత, ప్రౌఢకవితా సంపన్నుఁడు - విశేషించి భాషాధికారము గలవాఁడు - పండితుఁడు. ఈ విషయములను - కోణార్కలో ఈ రచయిత ప్రయోగించిన అన్వేషణ - ఋభువులు - రాజకరము - పంచాణము, ప్రాజాపత్యము - ద్యుమణి మొదలగు పదములే వ్యక్తము చేయుచున్నవి.

కోణార్కలో, పద్యములలో చక్కని చిక్కని శయ్యయున్నది. సర్వత్ర కదళీపాకము ఆస్వాద్యమైయున్నది. యతిప్రాసముల కొఱకు ప్రయత్నించినట్లు కన్పడదు - రచన జీవనదీ ప్రవాహము వలె సాగు చుండును - అది నిరంతర తైలధార.

కావ్యములో ఎడనెడ కొన్ని స్ఖాలిత్యములు సూక్ష్మదృష్టికి గోచరించుచున్నవి - అవి యన్నియు కవికృతములు కావని నా యభిప్రాయము - లేకరుల పొరపాటు వలన సంభవించినవే యని నా యూహ - స్వల్పముగా దోషములున్నను అవి కావ్య ప్రశస్తికి భంగకరములు కానేరవు. "ఏకోహి దోషో గుణ సన్నిపాతే నిమజ్జతీందోః కిరణే ష్వివాంకః" - అని మహాకవి యన్నాడు గదా !

రమణీయమైన యీ మహాకావ్యమునకు అభిప్రాయమిచ్చు నవకాశము కలిగినందులకు నేను చాల సంతోషించుచున్నాను - ఈ కవి బృందారకుని కమనీయ కావ్యసౌరభములను పతిత్రిలోకమున కందించుచున్న కవిగారి ధర్మపత్ని శ్రీమతి బాలాత్రిపురసుందరీదేవి గారిని హార్దికముగా అభినందించుచున్నాను - వారి కుటుంబమంతయు ఆయురారోగ్యములతో తామరతంపరగా వర్ధిల్లాలని మంగళాశాసనముల నందించుచున్నాను.

"కీర్తి శేషుడవయ్యు, సత్కీర్తి నింపు
నట్టి, కోణార్క రచనచే నమరుడవుగ
నైతివో శోభిరాల ! మాయదు యశస్సు
కావ్యకర్తకు మరణము కలదె జగతి"

"జయన్తి తే సుకృతినః రససిద్ధాః కవీశ్వరాః"

— బూరుగల గోపాలకృష్ణమూర్తి

# పరిచయము - కృతజ్ఞత

కోణార్క సూర్యదేవాలయం ఒరిస్సా రాష్ట్రంలో గల శిల్ప నిర్మాణాలలో సర్వశ్రేష్ఠమైనది. దీని శిల్పశైలి అనుపమానము, అద్భుతము, అద్వితీయము. దీనిని స్థాపత్య కళకు కేంద్రస్థానమన వచ్చును. ఆలయంలోని ప్రతి అంగుళంలోను స్థాపత్య, విగ్రహకళలు ఓతప్రోతమై ఉంటాయి. ఇది పూరీకి సుమారు 21 మైళ్ళ దూరంలో ఉన్నది.

ఉత్కళ ప్రభువు నరసింహదేవుడు, ఆయన మంత్రి రాజరాజు చారిత్రక వ్యక్తులు. నరసింహదేవుని ఆస్థానకవి, సాహిత్య దర్పణ కారుడు, విశ్వనాథుడు - తన అలంకార శాస్త్ర గ్రంథం 'ఏకావళి' లో ఆయనను 'యవనావనీ వల్లభ' అని సంబోధించాడు. అతని మంత్రి 'రాజరాజు' కూడ పూర్వచాళుక్య వంశానికి చెందినవాడని శ్రీ కూర్మంలో గల ఒక శాసనం ప్రమాణీకరిస్తున్నది.

ఇక విశుమహారాణా కూడ కల్పితవ్యక్తి కాదనటానికి ఉదాహరణలున్నాయి. ఒరిస్సా రాష్ట్ర ప్రభుత్వ సమాచార శాఖవారి పరిశోధనలు, జనశ్రుతిలో ప్రచారంలో ఉన్న కథలలో 'విశు' కోణార్క దేవాలయ ప్రధాన శిల్పాచార్యుడుగా కనబడతాడు.

కోణార్కను గూర్చి సాహిత్య ప్రపంచంలో అనేక కృతులు వెలశాయి. హిందీసాహిత్యంలో - శ్రీరామేశ్వరదయాళ్ దూబే 'కోణార్క' పేరుతో 5 సర్గల పద్యకావ్యంగాను, గోపబంధుదాస్ 'ధర్మపద్' అనే ఖండకావ్యంగాను రచించారు. కార్తిక్ ఘోష్, జగదీశ్ చంద్రమాథుర్‌లు నాటకాలుగా రచించారు. జగదీశ్ చంద్రమాథుర్ జనశ్రుతిలో ఉన్నకథకు - 'శిల్పి' ఒక శబరకాంతను

ప్రేమించి వివాహమాడినట్లు, వారికొక కుమారుడు జన్మించినట్లు, కారణాంతరాల వల్ల, తల్లిదండ్రులు, కుమారుడు విడిపోగా తండ్రి తనయులు కలిసికోవడానికి - శిల్పి తన ప్రియురాలైన శబరకాంతకు తొలుత కానుకగా ఇచ్చిన గజదంతపు కంకణం అభిజ్ఞానంగా నిలిచి నట్లు కల్పన చేసి - కడకు మంత్రి రాజరాజ చాళుక్యుడు నరసింహ దేవుని చంపడానికి దేవాలయాన్ని ఆక్రమించగా శిల్పి విమాన శిఖరాన్ని పడగొట్టినట్లు, దానితో దేవాలయం కూలి సర్వనాశనమై నట్లు - కల్పనలు చేసి కరుణరసప్లావితమైన కథను రౌద్రరసంలో పర్యవసింపజేశారు.

ఇక తెలుగులో శ్రీ అడివి బాపిరాజుగారు తమ తుఫాను నవలలో మరోవిధంగా వ్రాశారు. శిల్పాచార్యుడు తన కుమారుడు పసివాడుగా ఉండగానే సతీసుతులను విడిచి ఆలయ నిర్మాణానికి వెళ్ళినట్లు, దేవాలయ కలశస్థాపన చేయలేని సమయంలో ఒక యువ శిల్పి వచ్చి ఆ పని నెరవేర్చినట్లు, శిల్పాచార్యుడు ఈర్ష్యతో ఆ యువశిల్పి తన కుమారుడే యని గుర్తించలేక అతనిని కడతేర్చినట్లు చెప్పారు.

విశ్వజ్ఞ బిరుద విభూషణులు, వాస్తు జ్యోతిష విద్యాప్రవీణులు శ్రీ శోభిరాల సత్యనారాయణగారు చారిత్రక సత్యాలను, ఈ కావ్యనాటకాదులను, ఒరిస్సా ప్రభుత్వ సమాచారశాఖవారి పరి శోధనలను - అన్నిటిని పరిశీలించి ఇతివృత్త, పాత్రౌచిత్యాలను దృష్టిలో ఉంచుకొని కోణార్క కావ్యాన్ని రచించారు.

ఈ కావ్యాన్ని వారు 1983 లోనే రచించినప్పటికి, "శ్రీ మదాంధ్ర మహాభారత శిల్పకళాదర్శనము" ను పరిశోధించి ప్రచు రించుటలో దశాబ్దకాలం పైగా గడచిపోయింది. వారు 8-2-1996 న దివంగతులగుటచే 'కోణార్క' కావ్యాన్ని వెలుగులోకి తీసుకు రావలసిన బాధ్యతను నేను స్వీకరించవలసి వచ్చింది.

వారే ఉండి దీనిని ప్రచురించినట్లయితే ఈ కావ్యం ఇంతకన్న అన్నివిధాలా నిర్దుష్టంగా ఉండి ఉండేదనడంలో ఎట్టి సందేహం లేదు.

'కోణార్క' కావ్యాన్ని శ్రద్ధగా పరిశీలించి, పరిష్కరించి శోభిరాల వారిని "కావ్యరూప 'కోణార్క' శిల్పి" గా పరితల ముందు నిలిపిన సాహిత్యబ్రహ్మ, రాష్ట్రకేంద్ర ప్రభుత్వ విద్యాశాఖ పూర్వ సంచాలకులు, ఆత్మీయులు, మా శ్రేయోభిలాషి డా॥ వి. వి. యల్. నరసింహారావుగారికి నేను ఋణపడి ఉన్నాను. వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు.

వయోవృద్ధులైనా, నేను కోరగానే ఈ కావ్యాన్ని ఓపికతో పఠించి 'సమ్యక్ పరిశీలన' చేసిన - సాహిత్య విద్యాప్రవీణ, భాషా ప్రవీణ - కవిశేఖర - సుకవి సుధాకర - ద్వివార రాష్ట్రస్థాయి అవార్డు (పద్య కవిత్వములో) గ్రహీత - విశ్రాంత ఆంధ్రోపన్యాసకుడు బూరుగల గోపాలకృష్ణమూర్తిగారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు.

చిత్తులో వ్యస్తంగా ఉన్న పద్యాలను క్రమంలో కూర్చడానికి నాకు సహకరించిన - మా మానసపుత్రుడు చిరంజీవి డా॥ పి.బి.డి వి. ప్రసాద్‌కు శుభాశీస్సులు.

గ్రంథ ప్రచురణ బాధ్యతవహించి దానిని చక్కగా నెరవేర్చిన పుత్రతుల్యుడు (నా సోదరి శ్రీమతి ఆలూరి సుమతీదేవి కుమారుడు) చిరంజీవి ప్రఫుల్లచంద్రకు శుభాశీస్సులు.

ఆంధ్ర పాఠకలోకం ఈ కావ్యాన్ని శోభిరాల వారి ఇతర కృతుల వలెనే ఆదరించును గాక !

— శోభిరాల బాలాత్రిపురసుందరి

# అనుక్రమణిక

# ఆ ము ఖ ము

శిల్పి కులావతంసులనుఁ జిత్తమునందు భజించి-తత్కృతా
నల్ప కళావిలాసముల నాత్మఁదలంచి-తదీయదివ్య సం
కల్ప విశేష భావనల గారడి కచ్చెరువంది, సత్కథన్
బొల్పగు నొక్క కావ్యము నపూర్వముగా రచియించు వేడ్కమైఁ.

ఆలోచించుచునుండన్
నాలో నొకనాడు నూతన వికాసోల్లా
సాలోడనమై హృదయము
వ్యాలోల రసాతిరేకమై చెలువారన్.

రంగ దనూన భావములు రమ్యతరంగములై చలింప ను
ప్పొంగు మహోదయార్ణవము పోలికఁ జిత్తము తత్తరింపఁగన్
గాంగ కళాచమత్కృతులఁ గన్నులఁ గట్టెడి శిల్పశాస్త్ర పా
రంగతు లెందరో యచట ప్రాణములొయ్యన ధారవోయుటల్.

ముఖలింగ శివలింగములు ప్రతిష్ఠించి గాం
గులు విశ్వవిఖ్యాతి గొనరెయిచట ?
వంశధారా నదీవారి తరంగాల
కైతచిందులు ద్రొక్కి కదలునటవె !
గాంగ వంశీయుఁడనంగ భీముఁడు నిల్పె,
నట జగన్నాథ దేవాలయమ్ము;
భూప భీకరుఁడు వేములవాడ భీమక
వీశ్వరుండిట వాసికెక్కినాడు;

ఇట కులోత్తుంగ చోళ రాజిచ్చెఁగూతు
రాజసుందరిని - జళుక్యరాజునకును;
ఆ నవీన దంపతుల కనంతవర్మ
చోడ గంగు ద్భవించె యశోధనుండు.

అతనితో పాటు నాల్గుశతాబ్దములు క
ళింగ రాజ్యము తెల్గులేలిన దినాలు
మన చరిత్రలఁ గాన్పించు ఘనతరముగ;
గాంగ శకమది మనమెఱుంగనిది కాదు.

గాంగ సమ్రాట్టు లేలినకాలమునఁ - క
ళింగ వంశధారానదీ సంగ సుఖము
నిరుపమాన యశస్సుగా నిండిపోయి
నది శకరకాల దేవాలయాలతోడ.

ప్రచురముగ మతోద్ధరణ సల్పిని జనపతి,
ఆంధ్ర వాఙ్మయ సేవ చేయని నృపాలుఁ,
డల కళా శ్రీని పోషింపనట్టి నృపతి
గానరాఁ డొక్కఁడేనియు గాంగులందు.

ఆ కళింగ గంగాన్వవా యాబ్ధి యెలమి
పొంగి పొరలఁగ రాజుగాఁ బుట్టినాడు
కువలయానంద కరముగా గొనబుమీఱ
ధీవిశాలుఁడు నరసింహ దేవగాంగు.

అనఘుఁడతఁడు కోణార్క దేవాలయమున
సూర్యదేవు ప్రతిష్ఠింపఁ జూచినాడు
సకల శిల్పకళా పరిష్ఛ్రత్ప్రధాన
శిల్పి, సర్వజ్ఞ దైవజ్ఞ కల్పనమున.

ఆ కథ సవిస్తరమ్ముగఁ
జేకొని వ్రాయందలంచి చేతోమోద
శ్రీకుఁడనై తిన్ గావ్యము
నేకరణి రచింపఁ గలనొయేమో యెఱుగన్.

# శిల్పి

అదె ఉదయరాగ మదిగో శిల్పాభిమాని
సూర్య భగవానుఁడరుణ రోచులు వెలార్ప
నేడు రంగుల గుఱ్ఱాల నెక్కి, మింటి
తెరవెడలుచుండె నటుకార్యదీక్ష తోడ !

ఆ కర్మసాక్షి కెఱగుచు
లోకాతీతుండు శిల్పిలోకాధీశుం
డే కాంతమ్మగ గాయ
త్రీ కేవల విశ్వకర్మ హృదయము లోనన్.

నిలిపి ధ్యాన నిష్ఠ నిలచి కొండొకసేపు
కన్ను దెఱచినాఁడు; కాలశిల్పి
పద్మినీచయాను బంధమ్మునకుఁ బొంగి
పోవుచుంటఁ దాను బోవనెంచె.

బ్రహ్మవంశజుండు బ్రాహ్మీముహూర్తాన
లేచి, ఛాత్రవరుల లేపి, నదికి
పోయి కాల్యకృత్యములు దీర్చికొని సంధ్య
వార్చి సవితృ పూజ స్వస్తిగోరి.

బ్రహ్మతేజస్సు రాపాడు వర్చస్సుతో
కమనీయ భూతి పుండ్రములతోడ
రమణీయమైన రుద్రాక్ష మాలికలతో
ధవళ యజ్ఞోపవీతముల తోడ
క్రమమైన పింజె నీర్కావి దోవతి తోడ
హరువైన యుత్తరీయంబు తోడ
అచ్ఛాచ్ఛ జలపూర్ణమగు కమండలువుతో
తమిద్రుంచు కుఱుచలాతాము తోడ.

పిలకజుట్టుతోడ వెనువెంటఁ జనుదెంచు
బ్రహ్మచారి శిష్యవరుల తోడ
వేదపాఠములను స్వాదు స్వరాలతో
వల్లె వేసికొనుచు వచ్చుచుండు.

వేదార్థ విజ్ఞాన విభవంబు నార్జించి,
ఉపనిషత్సారమ్ము నుగ్గడించి,
జ్యోతిష త్రిస్కంధ సూత్రార్థముల్ నేర్చి,
సకల సాముద్రిక సరణి ద్రొక్కి,

సాహితీ రసపయస్సాగరమ్ము మథించి
లక్షణ గ్రంథజాలముల నెన్ని
మంత్రతంత్ర రహస్య మార్గముల్ శోధించి
స్థాపత్య వేదంబు చదివి చదివి

శిల్ప శాస్త్ర పారీణుఁడై జీవితమ్ము
ధార పోసిన గొప్ప విద్వాంసుఁడతఁడు;
దివ్య దీక్షా పరిష్కారి; - తెలియదనెడు
మాట వెలువడ నీయఁడా నోటి నుండి.

కర్మశాల కేగి కండువా నడికట్టు
కట్టి కూరుచుండెఁ గడక నతఁడు,
ఛాత్రుఁడొకడు వచ్చి సరగున వహ్నిఁ బ్ర
తిష్ఠ సల్పిపోయె నిష్ఠతోడ.



# కుమారశిల్పి గృహ పరిత్యాగము

ఒక్కనాటి ప్రాతఃకాల మక్కజముగ
సౌమ్య గంభీర మూర్తియై చాపమీద
నుజ్వలాకృతిఁ దాల్చి కూర్చుండియున్న
శిల్పి చెంతకుఁ గొమరుండు చేరవచ్చి.

"నాన్నా, నాకు విదేశయాత్ర సలుపన్ గౌతూహలంబయ్యెడిన్
కోనైన్లనన్ గుడిగోపురంబులను గోర్కుల్ దీర దర్శించి నా
కన్నుల్ పండువుగాఁగ వచ్చెదను; వ్యాఖ్యానింతుఁజిత్తంబులో
దన్నిర్మాణ కళాకలాపముఁ జమత్కారమ్ము వైదగ్ధ్యమున్"

అని విన్నవింప నంతయు
విని వింతగ శిల్పివరుఁడు వెడన వ్రాలయన్
దనయుని వదనాబ్జమ్మును
గనుగొని యీ విధముగా సగర్వముగ ననెన్;

“నీ కేమైనను బిచ్చిపట్టినదొ తండ్రీ, మత్కళా మాధురీ
శ్రీకల్యాణ గుణోన్నతుల్ తెలియవో ? శిల్పీశులం దెచ్చటన్
నాకన్నన్ మొనగాళ్ళు లేరని ననున్ ప్రాజ్ఞుల్ ప్రశంసించుటల్
నీకెన్నండు నెఱుంగరాదొ మఱి సందేహింతు వేలాయిటుల్ ?”

శిల్ప చాతుర్య సత్కళా కల్పనమున
పనితనము నందు, భావనాపటిమ యందు
నాకు మించిన శిల్పులున్నారొ లేరొ ?
నేను చూడని గ్రంథంబు కానరాదు.

నీవొక యింటి వాఁడవయి నీ ప్రియురాలును నీవుఁ గూడి సౌ
ఖ్యావహమైన జీవనము నందుఁ జరించుచు నొక్క పుత్రకున్
నీ వలె శిల్పశాస్త్రముల నేర్పరి గాఁగల వానిఁగాంచు మీ
వా విధి వంశవర్ధనుఁడవై వెదజల్లవొ కీర్తి చంద్రికల్ ?

అటులుగాక నీవు నాదేశ మీదేశ
మెల్ల దిరిగె దేని యిల్లు మరలఁ
జేరఁగలవొ లేవొ చెప్పగలాఁ డెవ్వ
డెట్టు లౌనొ యేమొ యెవ్వఁడెఱుగు !

పదునాఱేండ్లును నిండలేదుగదరా పట్టీ ! విదేశాలు పో
యెదవా ! నా సుకుమారి బిడ్డడవు; ఏ యే సీమలం దెట్టి యా
పదలం జెందెదొ ? భోజనాదులకు నా ప్రాంతాల నేరీతిఁ జి
క్కెదవో చిక్కుల; నీదు లేయెడదలోఁ గించిత్ విచారింపుమా !

అది అమావాస్య - నడురేయి; అందులోను
కనుబొడుచుకొన్నఁ గనరాని కారుటిరులు;
మణుల మాదిరిగా నభోమండలమున
వెలుగునీడలు చూపు తారల తమాష !!

కఱకు అంపము చేఁబూను ఘాతుకుండు
ప్రియ పరీరంభ కాంక్షియా ప్రియుఁడు, పవలు
కష్టపడి చెమ్మటూడ్చెడు కర్మశాలి
శాంతముగ నిద్రపోయెడు సమయమద్ది !

ఆతఁడు మేలుకాంచె నపు; డట్టిటు చూచె; సుషుప్తిలో మనో
యాతనలన్నియున్ మఱచిరందరు హాయిగ; నిద్రమత్తులో
నాతని తండ్రి 'పోదువటరా' యని యూరకె పల్వరించె; నా
జాతక మేమిటో యనెడు శంక జనించె కుమారశిల్పికిన్.

నా జిజ్ఞాస కళాభిమానమును విజ్ఞానానుబంధంబు నా
కీ జన్మంబున కార్యసాధనకు నేదే దారి జూపించి నా
పూజా పుష్ప పరీమళంబు దిశలన్ బూరించునో లేదొకో
నా జన్మర్క్షము సద్యశోలతికలన్ నాటించి నన్నోమదో !

ఆజన్మాంతము శిల్పశాస్త్ర విషయాభ్యాసాను రక్తుండనై
రాజన్మంజు కళావిలాసినయి శిల్పశ్రీకి నందాలలో
నాజూకుల్ బచరింతునో ? హృదయ వీణాతంత్రులల్లాడ నే
దో జల్పాకుఁడనై నశింతునో కదా యూహాప్రపంచంబులో.

నా తనువుండ, నా యెడద నాట్యము సల్పగ, శిల్పశాస్త్ర ని ష్ణాతుఁడనై కళారమకు శాశ్వతరూపము నేర్పరించు ని ర్మాతను గాఁ బ్రసిద్ధిఁగను మాన్యతగల్గునొ లేదొ నాకు ? నా యీ తలపోత లెల్ల నిటులేవొ తటిల్లతలై నశించునో !

ఆయా ప్రాంతములందు వర్ధిలెడు విద్యాపీఠముల్ చూచి త ద్ఛ్రేయోదాయకులైన పండితుల యాశీర్వాదముల్ గొంచుఁ ద ద్భూయిష్ఠ ప్రతిభా విమర్శనల ప్రాపుంగాంచి విజ్ఞాన కాం తాయత్తైకమనమ్ము తృప్తివడునాడానంద మెట్లుండునో !

మా పూర్వాన్వయ శిల్పసృష్టిగని - నిర్మాణక్రియా చాతురీ శ్రీపాండిత్యము నుగ్గడించి యెదలో జీర్ణించుకొన్నాక నా లో పొంగారు వినూత్న భావలహరుల్ జోడించి గ్రంథమ్ముగా రూపొందించెడు కోర్కె యెప్పుడయినన్ రూపొందునో లేదొకో.

పోవుదునా, గేహము విడి
పోవుదునా, తెలుపకుండ పోదున, తెలిపే
పోవుదునా, తల్లిదండ్రుల
కే వగ సమకూర్చి చూచు చెటుపోఁగలనో ?

అనుచు సందేహ మందేహుఁడగుచు లేచి
తల్లిదండ్రుల పూజ్యపాదాల కెఱగి
తలుపుమెల్లన లాగి గేహాళిని దాఁటె
గ్రామసింహము గర్జించెఁ గాలు ద్రవ్వి.

# 11

ఆ కొమ్మమీద నున్నవి
ఈ కొమ్మకుఁ బోవుచుండె నెన్నో పిట్టల్
కాకులు కూయుచు నుండెను
వేకువ నా బాలకుండు వెడలెడు వేళన్.



# అద్వేషణము

అది నృసింహ భూజాని సభాంగణంబు
గణన కెక్కిన సచివ పుంగవులు, కవులు
సకల సామంత జనపాల సముదయములు
కొలుచు చుండగ నారాజు కొలువుదీఱె.

వాని ముఖమేలనో కళావిహీనమై వి
షాద వీచులు దోచె నా సమయమందు;
తన హృదయమప్పుడెంత బాధపడుచున్న
దో ! కతమ్మేమొ ? తెలియరాదొక్కనికిని ! !

"ఏల నృపాల నీవదన మేలయిటుల్ కళ దక్కియున్నదో
యీ ! లవలేశమైన కలదే యెటనేని కొఱంత మాయెడన్ ?
తాలిమి దక్కియుండిన విధంబెఱిగింపుము, మేలుగల్గు భూ
పాలక, రాణివాసము శుభప్రతిపాదకమై తనర్చగా !

అని మంత్రి పల్కుటయు రా
జును మొగమున లేని నవ్వుఁ జూపెట్టుచుఁ గ
న్గొనె, జ్యోతిషశాస్త్ర రహ
స్య నిధానుఁడు శిల్పివరుఁడు సర్వజ్ఞుదెసన్.

ఆ దైవజ్ఞుఁడు కొంతసేపు గణిత వ్యాపార గంభీరుఁడై బాధా సూచక వక్త్రుఁడై యిటుల చెప్పంబూనినాఁడోయి రాజా, దేవేరికిఁ జెడ్డరోజులివి నీచారుకుండు షష్ఠస్థితుం డేదో వ్యాధిని దెచ్చి పెట్టెడు దినాలే తెంచె నిప్పట్టునన్."

అనవుడు భూపుఁ'డా' ననుచు నట్టె విచారముతోడఁ గ్రుంగిపో యినఁ గని పండితుండు 'పృథివీశ్వర ! చింతిలనేల దీని కొయ్యన గ్రహదోషముల్ తొలగునట్టులు తద్గ్రహశాంతిచేయ వచ్చును; వివిధంబు లావిధులు - చుక్కెదురా వివరింపలేనిచో.

పూర్వజన్మ పాపమ్ము లీపుట్టువందు
వ్యాధిరూపాన పీడించు నంద్రు బుధులు
పాపపరిహరణార్థమై ప్రాజ్ఞులెపుడు
పరగుచుందురు సత్క్రియా చరణకాంక్ష.

ఏ గ్రహమేనియు బుట్టుక
నాగ్రహమ్ముగ నుండెనేని నవిరళ భక్తిన్
ఆ గ్రహమున కొనరింతురు
విగ్రహపూజా విశేషవిధులన్ ప్రీతిన్.

దానములు సేయుచుంద్రు తత్తద్గ్రహాను
రూప ధాన్యాదులాత్మ సంతాప మడఁగ
జపములను సల్పుదురు - గ్రహశాంతి కొఱకు
రత్నములు దాల్చుచుందురు రాజచంద్ర !

మనసు ప్రియురాలిమీఁద సామ్రాజ్యభార
వహన గంభీరమూర్తి సభాస్థలమున
కలఁతఁ జెందిన హృదయంబు కప్పిపుచ్చి
యెన్ని నాళ్ళు ధరారాజ్య మేలెదోయి !

నీకు చిత్తశాంతి నెలకొను గాక ! దే
వేరి కింకరోఁగ భీతి లేదు !!
పాదల నిత్తుఁగెంపు పొదిగిన బంగారు
టుంగరమ్ము వ్రేల నుండనిమ్ము.

నీకును మాకునంతరము నిక్కము; రాజ్యరమా మనోహరీ
శ్రీకమనీయ హస్తములఁ జేతులు గల్ప ధరన్ నృసింహ దే
వాకృతి నంది పుట్టిన మహాగుణశాలివి నీవు - నిచ్చలున్
నీ కనుసన్నలన్ మెలఁగ నేర్చిన వారల మేము భూవరా !

నీవు కళాశీలుండవు
గావునఁ గట్టింపు మోయి కల్యాణకళా
సేవధిగ లోకబాంధవ
దేవాలయ మొండు కీర్తి దిక్కుల నిండన్.

ఆ సహస్రాంశు దివ్యదయారసమ్ము
గలుగు వారల కెపుడు రోగములు రావు
పూర్వము మయూర కవియు నీ పుణ్యమూర్తి
శతకము రచించె రోగనాశనము కొఱకు.

అర్కక్షేత్రంబున కో
నార్కుని సేవించువారి కారోగ్యంబుల్
కోర్కులు నెఱవేఱెడు నన
దార్కాణములెన్నొ గలవు ధారుణియందున్.

మును శ్రీకృష్ణుని ముద్దుపట్టియగు సాంబుం డీ మహాక్షేత్ర మం
దొనరన్ ద్వాదశ వర్షముల్ దినము ప్రత్యూషంబునన్ జంద్ర భా
గ నుపస్పర్శ యొనర్చి భాస్కర నమస్కారమ్ములన్ జేయుచున్
గనియెన్ శాపవిమోచనంబు, నిజరోగంబున్ నివృత్తంబుగా.

అనుచుఁ గూర్చుండె దైవజ్ఞుఁ డా నృసింహ
దేవగాం గంత డెంధాన తేజుఁగాంచి
శేముషీఘను నాస్థాన శిల్పివరుని
సాదరమ్మునఁ దిలకించి సత్కరించి.

ఘనుడా సాంబుడు స్వస్థుడైన పిదపన్ గల్యాంతవేళన్ నదిన్
దన చేజిక్కిన సూర్యవిగ్రహము నీ స్థానంబులో నిల్పి పో
యొనటంచున్ జనులాడు చుందుద్దురు - నాకిచ్చోట దేవాలయ
మ్మును గట్టింపఁదలంపు గల్గినది మత్పుణ్యంబునన్ సంకృతీ !

పిల్పించెన్ జనపాలుఁడుత్కల కళావిజ్ఞాన పారీణులన్
శిల్పాచార్యులు తంత్రశాస్త్ర నిపుణుల్ సిద్ధుల్ యథాశక్తిగా
శిల్పి బ్రహ్మ కనల్ప శిల్పకవితా శ్రీ సృష్టి సాహాయ్యముల్
సల్పన్ వచ్చిరి గీష్పతీష్టి నిరతుల్ త్వష్టల్ మయబ్రహ్మలున్.

రవి మందిర రచనోద్యమ
మవితథముగ స్థపతి వరులు 'య ఇమా విశ్వా
భువనాని జుహ్వ' దితి మం
త్రవిధిన్ జేసిరట వాస్తుదైవత పూజల్.

"ఓం నమో విశ్వదేవాయ ఓం నమః ప్ర
భాకరాయ ! మిత్రాయ ! దివాకరాయ !
కాలరూపాయ సవితాయ కామదాయ
ఓం నమో భాస్కరాయ తుభ్యం నమోస్తు.

పద్మగర్భ సమప్రభా ! పద్మహస్త !
మకరకుండల మాణిక్య మకుటధారి
సప్త సప్తిరథారూఢ ! సకలలోక
నయన ! శ్రీసూర్యనారాయణా నమోస్తు॥"

అని శిల్పులెల్లరు నతిభక్తితోడ
నినుని ధ్యానించిరి హృదయ పద్మముల.

ఉలులున్ సుత్తెలు చేతఁబూని మదిలో నుత్సాహ మొప్పన్ గృతాం
జలులై నిల్చిరి శిల్పిశేఖరులు దీక్షన్ ముక్తకంఠాన బు
క్కులు వల్లించిరి కొన్ని కొన్ని ప్రమదాంకూరమ్ములొక్కమ్మడిన్
కలలెత్తెన్ దలపెట్టినట్టి పని సాంతమ్మైన చందమ్మునన్.

ముఖ మండపమ్ములు మొదట నిర్మించి
భక్తమందిరము వివాహమండపము
చెలువొప్పఁగా పరిసేవిత దేవ
తాలయమ్ములు, క్షేత్రపాలకాలయము
హర్యక్ష కరిఘటాశ్వాది మృగాలు
నవయౌవనపు సొంపు ననలెత్తు హొయలు
నివ్వటిల్లు విలాసినీ విగ్రహములు
కనుల పండువు సేయగా శిల్పివరులు
నిర్మించి రట తమ నిపుణతఁ జూపి
ధృతిమీర కోణార్క దేవాలయమ్ము.

అందము లేని కొండశిలయై పడియున్న గజేంద్రమూర్తి కే
మందులు పోసిరో మఱొక్రమంబుగ శిల్పులు సిద్ధహస్తులై
చిందులుద్రొక్కి దంతి నవజీవనమున్ బురుణించి కొంచు నా
నందరసైక ఖేలనమునన్ గరమెత్తుచు ఘీంకరించెడిన్.

ఎన్ని దేశాల గుఱ్ఱాలనే కళాత
పస్వి పరిశీలనము చేసి భావమందు
నిలిపికొన్నాఁడొ ? తన నేర్పు కలిమివలన
విశ్వవిఖ్యాతిఁగనె హయవిగ్రహమ్ము.

ఇరువది నాల్గుచక్రముల నెంతటి శిల్పకళాచమత్కృతుల్
దొరలినవో విచిత్రముగఁ దోఁచు, ద్యులోకము నందహర్నిశల్
పరువిడు కాలచక్రగతి భాసిలు దివ్యరథంబులాఁగు నా
తురగము లేదు వానిఁదమిలో దిలకించిన జన్మధన్యమౌ.

సూక్ష్మరేఖా కళౌన్యాస సుందరమ్ము
భావబంధురమిక వేయి పల్కులేల ?
మంటపమ్మున సౌందర్యమయముగాని
భాగమంగుళమైన గన్పడదు చూడ.

ప్రేమపుంద్రాళ్ళ నెట్టులో ప్రేంచుకొని - ని
రంతరమును - ఈశ్వర దర్శనాభిలాష
నలరు తాపసులకు పరీక్షలను బెట్టు
పుణ్యమూర్తులు దివ్యశిల్పులు నిజంబు !

వాక్కుచేత సుకవి వర్ణించు నెదియేని
మంచి పాఠకుడు గ్రహించు దాని
తెలివి చేత శిల్పితలచిన దంతయు
జేసి చూపగలడు చిత్రముగను.

ఇంత కఠినంపురాలతో నెన్నియెన్ని
చిత్రలోకాల నతఁడు సృష్టించినాఁడొ !
కాలగర్భములో కొన్ని గలసిపోయె,
శిథిలములనైనఁ జూడుమా పథికవర్య !



# శిల్పదర్శనము

అలరించున్ భువనైకమోహనములై వ్యాపించి రత్నాకరో
చ్ఛల దుత్తుంగ తరంగభంగములఁ జంచచ్చంద్రికా సైకత
స్థలులన్ మిత్రవనౌషధీ ప్రకర పత్రశ్రేణిబంగారు త
ళ్కులు గుల్కించుచు వెల్గుచూపి ధరణిన్ గోణార్క శోణద్యుతుల్.

సత్యవ్రతుడను నాతడు
నిత్యకళారాధకుండు నిర్మల హృదయుం
డత్యంత భక్తి భగవత్
ప్రీత్యర్థము వచ్చెనాలుబిడ్డల తోడన్.

ద్యుమణి మణిమందిరాగ్రభాగమున నిలిచి
స్వాగతోదాత్త మంగళధ్వనుల తోడ
వే వెలుంగుల దోరయిట వెలసె ననుచు
చాటెడి మృదంగ వాదిని స్వామిభక్తి.

సప్తశ్రేణీ కలాకలాప రచనా సంశ్లిష్టబంధమ్ముతో
సప్తాశ్వాలయ తోరణ ప్రకర మాశ్చర్యంబు గల్గింప సం
తృప్తింజెంది కళావిలాసినికి బందీలైన చందమ్మునన్
సప్తాశ్వున్ గనఁబోరు ముందునకు తత్సాన్నిధ్యమున్ చేరియున్.

ఈ నిర్మాణ విశేషముల్ గను డిటుల్ హేలావిలాసంబుగా
నానాభంగుల నాట్యముల్ సలుపు కాంతాళోక మింపౌ నొడి
స్సీ నృత్యంబులు సేయుచుండు నెపుడీ శిల్పంబులన్గన్నచో
నానందంబు ఘటిల్లు, శాంతిలు వ్యథావ్యగ్రాంతరంగంబులున్.

రమణన్ బిల్లనగ్రోవి నూదుచును వార్తల్ పంపునో యేమొ త
ద్రమణున్ జేరగ రమ్మటంచు కనుమీ రాధన్ మనోహారిణిన్
తమకం బొప్పఁగ నొక్క తంబురను చేతంబూని వాయించు నీ
ప్రమదారత్నము భక్తితత్పరత మీరాబాయిఁ బోలున్ జుమీ !

ధిమిధిం ధింధిమి యంచుమ్రోయు శుభవాదిత్రంబులొప్పన్ మృదం
గము వాయింపఁ గరంబునెత్తె నదె సోత్కర్షన్, మనోజ్ఞంబుగా
కొమరుంబ్రాయపు సోయగంబులను నిగ్గుల్ సూపు వాల్గంటి భం
గిమఁ గంటే ! మదనోత్సవంబునకు సంకేతంబుగా దోచెడిన్.

ప్రణయవతిఁ గంటె ! చేతదర్పణము బూని
కొసరి కయిసేసి కొనుచట గూరుచుండి
ఇంత ప్రౌఢాయె నేల రాడింత వఱకు
వల్లభుండని మదినెంతొ వగచు చుండె.

అన్నులమిన్న యోర్తుకుసుమాయుధు గోరి భజించు చిమ్ముగా
వన్నెలు చూపుచున్ వలపు వాంఛలు పైకొనఁ దన్మనోహరున్
గన్నులలోన నిల్పుకొని కౌతుక మొప్పఁగఁ దన్మయత్వమున్
గన్నదివోలె నిల్చినది కాంచుఁడెదన్ గదలించు దృశ్యమున్.

ఒకచోట డాకేల ముకురంబు చేఁబూని
ముద్దుగాఁ దిలకంబు దిద్దుకొనుచు
ఒకచోటఁ బిల్లవానికి ప్రేమ పొంగార
నేకాంత మరసి పాలిచ్చికొనుచు
ఒకచోటఁ దంబురా నొయ్యారముగఁ బట్టి
యింపుమీరంగ వాయించి కొనుచు
ఒకచోటఁ గొమరుడూరక నె యేడ్చుచుఁ జంక
కెక్కిన వాని నాడించికొనుచు
ఒక గృహిణి గానిపించుచునుండు నిచట,
స్కంధమున గూరుచున్న పికంబు తోడ
ప్రియున కెదియొ సందేశ మంపించుచుండె
భవ్యగుణధామ యొకభామ పరగునిచట.

సింహాసనమున నృసింహాఖ్యుఁడు గాఁబోలు
ముద్దాడుచున్నాఁడు ముద్దుపట్టి
వామభాగంబున వారణమ్మును, నశ్వ
పాలకుల్, మ్రొక్కు సేవక గణంబు

రాజాంగనలు పోవు రమణీయ పల్యంకి
కయు మోయు బోయీలు గలరు చూడు

ఛత్రధారులు పరిచారికలును జీన
మర్చిన హయ మష్టమంగళమ్ము

ఖడ్గమును బూని సైనికాగ్రణి యొకండు
విల్లు నమ్మును గలయొక వేటకాఁడు
భక్ష్య భోజ్యాలు గల భాండ పంక్తితోడ
డంబముగఁ జను రాజకుటుంబ మెటకొ !

ఈ మహామహుఁ డెవ్వఁడో యిచట నున్న
తాసనాసీనుఁడై యుపన్యాస మిచ్చు
చున్న వాఁడాత్మ సంతృప్తిఁ గన్నవాఁడు
శ్రద్ధతో రాజపుత్రు లచ్చటకుఁ జేర!

వారు వచ్చిన గుఱ్ఱముల్ వారణములు
తోడవచ్చిన భటులును దొరలచెంత
ఛత్రములు పట్టు వారలచ్చటకుఁ గొంత
దూరముగఁ బోయి నిల్చియున్నారు గనుము.

ముకురమ్ము చేపట్టి మురిసెడి నొక చోట
సాయుధుండై నట్టి యోధపుండు
ఒకచోట పలుయాచకోత్తములకు దాన
ధర్మంబులను జేయు ధరణి భర్త

అల్లదే ! యొకచోట నాస్థానమందు సం
భాషించుచున్నాడు భవ్యమూర్తి
ఒకచోట రాజు పత్రిక నొండు చేకొని
పఠికించుచున్నాడు పార్థివుండు

ఛత్రధారులు వెంటరా జన విభుండు
నడచిపోయెడి సర్వసన్నద్ధుడగుచు
నొక్కచో, నొక్కచో నశ్వమెక్కి పోవు
నతఁడు నరసింహనరపాలుఁడగునో కాదో ?

ఒక్కచో నర్చకుల గూడియున్నవాడు
ఒక్కచోఁ జేరి యుయ్యేల లూగువాడు
ఒక్కచోట శరాభ్యాస మొప్పఁజేయు
చున్నదెవ్వడు నారసింహుండు గాక !

ఒక్కచోట జగన్నాథు ద్రొక్కుచుండు
నొక్కచో శివలింగమ్ము నొక్కచోట
మహిష మర్ద్దిని గాంచి నమస్కరించు
పరమత ద్వేష మెఱుగఁడు పార్థివుండు.

అరుణ స్తంభము గాదిది
నరసింహోత్కల నరేంద్రనవ విజయశ్రీ
కిరణ క్రాంతి స్తంభము
ధరవెలుగుత మా హిమాంశు తారార్కముగా

ఉపనతోన్నమితాపసవ్యోరుపర్వ
డగుచు వికసిత పద్మమ్మునందు వామ
జానుఫలకమ్ము నిలిపి, యంజలి ఘటించి
యరుణుఁ డుపవిష్టుఁడాయె స్తంభాగ్రమందు.

ఖడ్గ ఖేటకధారి భీకరముఖారిఁ
గ్రోధ ఘూర్ణితమై త్రొక్కు ఘోటకంబు
డిగ్గి కళ్ళెంబు లాగెడి శేవగంటె
ధరణి పతిఁబోలు నీ ధనుర్ధరుఁ డెవండొ ?

భల్లమ్ముతోడఁ బొడుచుచు
భల్లూకము కాళ్ళుగట్టి పటుతర శక్తిన్
దల్లడ పెట్టుచు లోగొను
మల్లుని గనుగొన్న మనకు మైపులకించున్.

ఇంతులు రూపగర్వితలు హ్రీంరహితల్ విరహార్తలున్ వృష
స్యంతులు - చారుశీలలు కులాంగనలున్ సహపంక్తి నిల్చి య
ర్చింతురు సూర్యమందిరముఁ జేరి మనోరథ సిద్ధికోసమై
వింతలలోన వింత యిది వేడుకతోఁ దిలకించువారికిన్.

కాద్రవేయులు నాగలోకమ్ము నుండి
భూతలమ్మునఁ గలుగు నద్భుతము చూచి
పోదమని వచ్చి యానందపూర్ణులగుచు
నిలిచిపోయిరి తిరముగా వలస వచ్చి.

వ్రతములు దానముల్ సలుపవచ్చెడి జవ్వని చంద్రభాగలో
సతతము స్నానమాడి రవిసద్మము చుట్టుఁ బ్రదక్షిణంబు నం
చిత మతి సేయు నారమణి చెంతనె సిక్తసుదీర్ఘ కైశికీ
చ్యుత జల బిందు పానరత సుందర పత్త్రిరథంబు గాంచితే.

గంధపు గిన్నె చేతఁగొని క్రాలన్గులన్ దిలకించి స్వామికిన్
గంధము పూయనోపు ! శుభకర్మమునన్ గత పాపకృత్యముల్
బంధములున్ దొలంగునను భావమునన్ బ్రభుసేవ సేయునో
గంధ గజేంద్రయాన ! హరికార్ముక మోయన నిచ్చెనిచ్చటన్.

కావడి మోయు వాడొకడు గన్పడు చీకులఁ దల్లిదండ్రులన్
సేవలు చేసి తన్పు మది చింతఁ దొరంగి, యదృష్టహీనుడౌ
శ్రావణుడేమొ పాపము ! నిషంగి శరాహతిఁ జేసి ప్రాణముల్
పోవు క్షణంబులో నెఱుగబోడు విధాతృ విచిత్ర కృత్యముల్.

వెనుక నుండి వచ్చి వెఱగందు బిత్తరి
బిగ్గ గాగిలించి యుగ్గడించి
మధుర మధురమైన మాటలఁ జెవిలోనఁ
బ్రేమ కథలు చెప్పు ప్రియుని గనుమ.

తరుణీ ముఖ చుంబనమును
గురుకుచపరిరంభ సుఖము కూరిమితో మై
మరపించెడి తన్మధురా
ధరామృత పానము దైవదత్త వరంబుల్.

పరమ సంతోష భరితులై పరగు నూత్న
దంపతులఁ జూచి వక్రదృగ్దామ యగుచు
నాగ కన్యక వెడనవ్వు నవ్వుచుండె.
తన సొగసు భాగ్యలేశమ్ము దలచికొనుచు.

వేసము మార్చినన్ గృహము వీడిన వెంగలి వోలె గడ్డమున్
మీసలు పెంచినన్ జనులు మెచ్చఁ బరాంగనఁ గోరుచెంతయున్
దోసమటంచుఁ బల్కినను దొయ్యలి యొంటిగ నున్న దొంగ స
న్యాసులు కొంగు పట్టెదరు నర్మిలి మాటలఁ జెంతఁ జేరుచున్.

మగువ లటునిటు మధ్యలో మగడొకండు
కేలు కేల్వట్టి ద్రుతగతిన్ దూలి సోలి
మండలాకృతి దిరుగుచు మసలు నాట
విక జనమ్ముల దండలాసకము గనుము.

స్మర సామ్రాజ్యము నేల వేడ్క మెయి పద్మక్షేత్రమున్ జేర నీ
నరనారీ నివహంబు సాగరముఁ సందర్శించి యుప్పొంగి, సుం
దర వర్ణాంచిత సైకతస్థలుల గంధర్వోపభోగమ్ములన్
జెరలాటమ్ముల గూడి యుండెదరు నిశ్చింతన్ సుఖస్వాంతులై.

తన వాడెవ్వడొ కానివాడెవడొ మైదానంబులో గాఢ ని
ద్రను బన్నుండిన వేళనెట్లు తెలియున్? ధృష్టుండెవండో నిశీ
థిని సౌందర్యము కొల్లగొట్టు; నవిసీతిన్ మాన్ప రెవ్వారుఁ; గాం
తనె దూషింతురు సర్వమానవులు నన్యాయంబుగా భాస్కరా !

మాతా పితరుల తుంటరి
చేతలు గని బాలకుండు చీచీ యనుచున్
గౌతుకము వీడి కన్నులు
చేతులతో గప్పికొనెడి చిత్రము గంటే.

తీవ్ర మదనార్తి పురుషాకృతిని ధరించి
కూరిమి మిటారితో జతగూడియున్న
తెఱవగని కన్నులటునిటు త్రిప్పికొనుచు
తీఁగసాగెడి నీ యువతీ త్రయంబు.

చంద్రభాగాసరిత్పతి సంగమములు
సరసులగు సంయమీంద్రుల చాటుకథలు
శక్తిసాధన చక్రపూజాక్రమంబు
కుడ్యముల కెక్కె యువశిల్పికులము వలన.

వామాచార పరాయణుల్ కుల వధూవార ప్రియుల్ తాంత్రికుల్
భూమిన్ సర్వసుఖంబులందెదరు సంపూర్ణానురాగంబుతో
కామాచార పరాయణుల్ సురవధూ కాంతారతుల్ వైదికుల్
భూమిన్ సౌఖ్యములందనొల్లరల స్వర్భోగమ్ములన్ గోరుచున్.

ఇంపగు తాంత్రిక రతికిని
లంపటులగు వారి కేవల పశుక్రియకున్
దాంపత్య జీవనమునకు
పెంపగు భేదంబు గలదు పెనఁకువ యందున్.

పరమ పవిత్ర భావమునఁ బౌరుషమున్ విడనాడి పేర్మిమై
పురుషుఁడు శక్తిసాధన సముజ్జ్వలతన్ గను, శక్తియున్ మనో
హరముగ దివ్యభోగముల నందు నటుల్ సరసార్ద్రచిత్తమై
సురు చిర సౌఖ్యమిర్వురకుఁ జూపు నవశ్యము స్వర్గమార్గమున్.

రతి పరాకాష్ఠ నొందు నచ్చంపు వేళ
రూప మొండు గన్పించునే ? రూపరహిత
మైన యానంద పారవశ్యంబు గాక !
అది చలించు బ్రహ్మానంద సదృశమగుచు.

అన్యచింతన లేక యనంగకేళి
నిర్భరానంద రసపయోనిధిని దేలి
మేనుమఱచి యొండొరులలో లీనమగుచు
ద్వైతమును వీడఁగల్గు నద్వైతసిద్ధి.

చెలిమి నాలుమగలు జీవాత్మ పరమాత్మ
వేఱటన్న తలపు దూరమైన
భావమందుఁ జూడ జీవాత్మయే పర
మాత్మయన్న జ్ఞానమబ్బునపుడు.

సృష్టి రహస్యమున్ దెలిసి సృష్టికి కారణభూత మాత్మ సం
తుష్టికి మూలమైన గుఱుతున్ బరదైవతమంచు నీ ప్రవి
త్రేష్టి రహస్యముల్ దెలిపి యెల్లరకున్ సుఖమీదలంతరో
శిష్టులశిష్టులున్ సకలజీవులు మెత్తురటంచు నెంచిరో.

కామశాస్త్ర రహస్యముల్ కాముకులకుఁ
దంత్రశాస్త్ర రహస్యముల్ తాంత్రికులకు
ధర్మశాస్త్ర రహస్యముల్ ధర్మపరుల
కెఱుఁగ జెప్పెడి శిల్పము లెన్నిగలవొ !

భవబంధమ్ములు వీడ దీపశిఖపై బద్మాక్షుపై బద్మపైఁ
బువుపైఁ బుష్పరజంబుపైఁ బులుగుపైఁ బూఁబోఁడి కన్దోయిపై
శివలింగంబు పయిన్ సుధాంశుకళపై శ్రీచక్రమధ్యస్థ బిం
దువుపై భక్తులు దృష్టినిల్పి పరవస్తు ధ్యానమున్ జేయరే ?

వ్యామోహమ్ముగ చిత్రబంధ సహితానంగ క్రియాభంగిమల్
కామోద్రేక పురస్సరమ్ములయి సింగారమ్ము లొల్కించి మా
యామోహాకృతి ముక్కుమూసికొని సన్యాసించు బైరాగియే
ఏమాత్రమ్ము చలించినన్ వలపు రేకెత్తించు చిత్తమ్ములన్.

ప్రేమ పుంద్రాళ్ళ నెటులేని త్రెంచుకొని - ని
రంతరమును - ఈశ్వరదర్శనాభిలాష
నలరు తాపసులకు పరీక్షలను బెట్టు
పుణ్యమూర్తులు తెలుగు శిల్పులు నిజంబు !



# శిల్పి నిర్వేదము

సాయం సంధ్యోపాసన
చేయం జనుదెంచి శిల్పిశేఖరుడు సరిత్
తోయముల వార్చి పిమ్మట
హాయిగఁ బవళించె నంబరాభిముఖుండై.

అటుల బవళించియున్న యా శిల్పివరుని
మనము నందట్టె నిలిచె నా చంద్రలేఖ
ప్రియమనోహారి పుత్రుని తోడఁగూడి,
విశుమహారాణ యూహాల వెలసియాడె.

సహజోదార గుణాభిరామ ప్రియయోషారత్నముత్తానమత్
గృహదీపంబును స్నేహపూర్ణముగ వెల్గించెన్ దదీయాంచిత
స్పృహణీయోజ్జ్వల జీవితంబు వెలయించెన్ గొన్నినాళ్ళిట్టులన్
బహుకాలంబు వియోగబాధ భరియింపంజాలకెట్లున్నదో.

తనయుం డిప్డిలు సేరియుండనగు గాదా ! మాతృమానోక్తులన్
వినువాడై వినయాది సద్గుణ గణాన్వితుండునై విజ్ఞుఁడై
పనివాడై పరిపూర్ణుడై వివిధ శిల్ప ప్రక్రియల్ సేయ నే
ర్చినవాడై ఘనకీర్తి దెచ్చునను చున్ జీవించెదన్ కాంతుతో.

అనురాగ వల్లి నా కొటి
కనుదినము ప్రతీక్ష సలుపు చారాటముతోఁ
తనయుని దీరిచి దిద్దుచు
దినములు లెక్కించుచుండు దీనాననయై.

ఏ గతి చంద్రలేఖ సుతునేలెనో ? యేగతి నాసుతుండు శి
ల్పాగమశాస్త్రముల్ గురుకృపానుమతిన్ బఠియించినాడో ? గే
హాగమ నాభిలాషఁ బనియైన యనంతర మేనుబోయినన్
స్వాగత మిచ్చునే యెదురువచ్చి ప్రియాంగనతోడఁ బుత్రుఁడున్

దేశమందెచ్చటేనియు దేవళములు
గట్టుచోఁ జంద్రలేఖ నొక్కతను విడిచి
చనిన, దుఃఖంబు దిగ్రమింగి జవ్వనమున
విరహ సంతప్తయగుచు జీవితము గడపె.

ద్యుమణిన్ మ్రొక్కి దుమాపతిన్ గొలువ దాదుర్గామహాదేవి భ
క్తి మెయిన్ జేరి భజింపదెన్నడు సరిత్తీర్థంబు లందాడ ది
ష్టమునన్ శీఘ్రఫలప్రదంబని మదిన్ సంతానగోపాల మం
త్రము సైతంబు జపింప దాత్మవిభునే దైవంబుగా నెంచుచున్.

భర్తృవిరహ బాధ బహువత్సరంబులు
కోపతాపములను గొన్నినాళ్ళు
సంతులేక కొన్ని సంవత్సరంబులు
సౌఖ్య మెఱుఁగదొకట చంద్రలేఖ.

పతియే దైవముగాఁ దలంచి పరదైవధ్యానమున్ జేయదా
శత ప్రతీక్షణ దైవదత్త చిరవాంఛా పూర్తి నెన్నాళ్ళకో
సుత సౌభాగ్యము గాంచినంత పతిశుశ్రూషాదులన్ మాని సం
తత మాడింభకు తోడనే గడపె వాత్సల్యాతిరేకంబునన్.

స్వీయ గృహమునఁ గల నాదు శిల్పశాల
స్త్రీ ప్రతిమలందముగ నేను జెక్కునపుడు
వచ్చి యెదురుగ నిలుచుండ వలయునన్న
సిగ్గులొలుకుచుఁ జనుచాన చెలువ మెంతు.

తరుణి నతిచరింప ధర్మార్థకామాదు
లందటంచుఁ బెండ్లియందుఁ బలికి
ధరణి పతులఁ గొలువ ధర్మపత్నిని వీడి
చన్నయట్టి యఘము చనునె యురక!

తావు లీను పూల దేవిపూజలు సేయ
దేవిగా లభించె దివ్యకాంత
తావిలేని పూల దైవంబు పూజించి
తాను వడసె నన్ను ధర్మహీను.

నాడు పర్యవేక్షణమ్మున సూర్య దే
వాలయమ్మును గట్ట నాజ్ఞ యిచ్చె
నన్ను గౌరవించె నరసింహదేవుఁడు
కీర్తికాంత నన్నుఁ గీలుకొలిపె.

పోలుపారన్ రవిధామ మద్భుత కళాపూర్ణంబుగా రాజశి
ల్పులు సిర్మించిరి గాని పైని గలశంబున్ నిల్పలేరైరి, కౌ
శలమున్ జూపి విధిప్రకారముగఁ బ్రాసాదాగ్రభాగంబునన్
గలశం బెవ్వడు నిల్పునో యతనికే గల్గున్ బురస్కారముల్.

పదిరెండేళ్ళు గతించె నిప్పటికి స్థాపత్యోపపన్నుండనై
సదనంబున్ బ్రియభామినీ సుతుల రక్షన్ స్వామిపై నుంచి, యే
ముదమున్ లేక కఠోరదీక్ష గుడి సంపూర్ణంబుఁ గావించితిన్.
తుదకీ స్వల్ప విధానలోపమెదలో దుఃఖంబు గల్గించెడిన్.

ఎంత యోచించినను దోసమెందుగలదో
దోష పరిహారమేమియో తోపదకట
బుద్ధిజాడ్యంబు నాత్మబంధు ప్రమాద
మొసగు శని పంచమంబున నుండెనేని.

మత్తనయుండు ధర్ముఁడను మత్ప్రియ భామిని చంద్రలేఖ నా
చిత్తము నాహరించి పనిసేయగ నీయరు, రాజునానతిన్
కత్తులబోనులో దిగిన కైవడి నిచ్చట నున్నవాడ నీ
ఉత్తలపాటులో సరిగ యోచన సేయగఁ బోలనక్కటా.

కట్టడములోన దోషంబు గలిగెనేని
తాపిపనివాండ్ర లోపంబు, తప్పునాది
సర్వ శిల్పాధికారినై సమయమందు
దోసమును దొలగింపఁగాఁ దొడరకుంట.

ఇందరు శిల్పిసత్తము లహీన గుణాత్ములు శాస్త్రవేత్తలున్
మందులుగారు, భాస్కరుని మందిర మందముగా రచింప నా
కుం దమ శక్తియుక్తుల నకుంఠిత రీతి నొసంగి నార లీ
చందమెఱుంగరే విధివశంబునఁ దోపదు గాక యేరికిన్.

జనపతి యుద్ధరంగమున శత్రువులన్ దునుమాడు చుండ దు
ర్జనుడగు మంత్రియే యిపుడు రాజ్యము సేయఁ దొడంగె మాఱుగా
పనివడి నాలుగింతలుగఁ బన్నులు పెంచి మహాకఠోర శా
సన విషవాయువుల్ వదలె జానపదుల్ వెఱగంది పర్వగా.

గ్రామంబుల్ బహుకష్ట భాజన జనాక్రాంతంబులై యుండ సం
గ్రామంబుల్ బొనరింప సైనికుల సంరక్షార్థమై నీతియున్
నేమంబున్ విడనాడి రాజకరమున్ దీవ్రంబుగాఁ బెంచియున్
స్వామిద్రోహ మొనర్చునే కడుదురాశన్ దాష్ట్యమున్ జేయునే.

పల్లె ప్రజల ధనంబెల్లఁ గొల్లగొట్టి
గుడులు గట్టింపఁ బున్నెంబు గూడు నొక్కొ !
పాపభాండ మదెప్పుడో పగుల కున్నె
కలుషచిత్తు లడంగరే కాలగతిని ?

రాజసచివుఁ డెంత రాతిగుండె గలాఁడో
కాకవులను జంపఁగా దలంచె
రాజ్యకాంక్ష యెంత ప్రబలమై యున్నదో
హత్య జేయనెంచె నవని పతిని.

ఆలయమ్మున రవి విగ్రహ ప్రతిష్ఠ
జరుగు సమయములో హత్య జరుగునట్లు
వ్యూహమును బన్నెనట సచివోత్తముండు
పార్థివుండుండె సర్పంబు పడగ నీడ.

కసిమసి రాజభక్తిగల కారువులున్ బనివారు కొందఱున్
బసగలవారు - నేఁడుగడపై బహుకాల వివిక్త జీవన
ప్రసితి భరింపలేక చన, వచ్చిరి కొందఱు చంద్రభాగలో
మొసళులవోలె గోప్యకులు ముష్కరులై నృపమంత్రి పంపునన్.

అతి వినయంబు చూపెడు మహాసచివుంగని నప్పుడే మహో
న్నత గుణధాముఁడైన నరనాథున కానరసింహదేవ భూ
పతికిని వీనికిన్ గల విపర్యయ మారసినాఁడ రాజు నా
నతియుఁ దదీయ మాత్ర సుమనోరథమున్ నను జేర్చె నిచ్చటన్.

దేశములోన సూర్యునకు దేవళమొక్కటి కానరాదు, పృ
థ్వీశులు కోరినప్పుడె రచింపవలెన్ శ్రమమైన, లేనిచో
నాశయముల్ ఫలించునె కళాభిరుచుల్ ప్రకటింప నౌనె శి
ల్పీశుల కెల్లవిద్యలు నశింపవె భూమి నిరర్థకంబులై ?

కోరినయట్లు సేయవలెఁ గూడ దటంచు వచింపరాదు, బం
గారము గ్రుమ్మరింతు మనగా విని సంతసమందరా దహం
కారుల తోడి పొత్తు భుజగంబులతోఁ జెలగాటమీ కళా
కారుల జీవితంబు లధికారుల హస్తగతాక్షుపాళికల్.

భూమితు చేసి యుత్కళ విభుండభిమానముతోడ నన్వే న
ధ్యేషణ చేసె సూర్యగృహమీ సికతాస్థలిపై రచింపఁగా
నీపదశక్తి జాగగుట నెన్ని యమాత్యుఁడు రాజవీధులన్
ఘోషణ సేయునే ? యిపుడు క్రొత్తగ నెవ్వడో వచ్చి చేయునే

యువశిల్పి యొకడు వచ్చెను
సవిత్రు మహామందిరంబు సవరణ సేయన్
వివరమ్ము చూచి లోపము
సవరించెడినట ప్రయత్నసాధ్యం బైనన్.

కానిమ్ము చూత మదియును
నా నెయ్యరి యెవఁడో వచ్చి నను కృతకృత్యుం
గా నొనరించిన వానికి
నానార్థము లొసగు సూర్యనారాయణుఁడున్.

ఏ వాడైనను గ్రచ్చఱ
దీ విభవము తోడ లోటు దీర్చిన యెడలన్
దేవళము పూర్తి యగునది
కావలయు నభీష్టసిద్ధికై సర్వులకున్.

పుష్యమాసాంతమునకు సంప్రాప్తమైన
మాఘ శుద్ధ సప్తమి దినమధ్యమందు
స్వామిని ప్రతిష్ఠ సేయఁగా వచ్చునంచు
వార్తఁ బంపించె మంత్రి దూర్వారుఁడగుచు.

ఒక్కొకప్పుడు పరువెత్తి యుదధిలోనఁ
బడుద మనిపించు; మమతానుబంధ మధుర
భావములు దారికడ్డుగ వచ్చి నిలుచు
నాత్మహత్య మహాపాపమంద్రు బుధులు.

మరణము భౌతికంబయిన మార్పు; జీవుడు జీర్ణవస్త్రమున్
దొరగి వినూత్న వస్త్రము యథోచితవృత్తి గ్రహించునట్లుగా
సురిగిన దేహమున్ విడిచి చూచుకొనున్ మఱియొక్క రూపమున్
బరమపదంబు చేరుకొను బంధములన్నియు వీడిపోయినన్.

అవమానంబు భరింపలేక యెటొ దేహత్యాగమున్ చేయగా
లవణాబ్ధిన్ బడినన్ మహీస్థలి జనుల్ మన్నింతురే నన్ను దు
ర్వ్యవసాయంబు ఫలించునే, హరశిరోరత్నంబుగా నుండి సం
స్తవనీయుండగు నా కళానిధియు మచ్చన్ మాపుకోగల్గెనే.

బహు పురాతనమైన దేవాలయమున
సాంబుడు ప్రతిష్ఠ సల్పిన స్వామి దివ్య
విగ్రహము నింపు నిల్పిన వేగిరముగఁ
బూర్తియగు పని మెచ్చును భూమిపతియు.

# 40

ఒకపరి ప్రతిష్ఠ జరిగిన
యొక ప్రతిమఁ బునః ప్రతిష్ఠ యొనరింపంగాఁ
బెకలించుట పాపం బది
సకలారిష్టములు దెచ్చు సరిగాకున్నన్.



# కుమారశిల్పిచే శిఖరస్థాపన - శిల్పుల ఈర్ష్య

సూర్యు బ్రార్థించి నాడు కుమార శిల్పి
శ్రీ విమాన శిఖర పద్మశిల నమర్చె
స్థపతి వర్యుల జయజయధ్వనుల మధ్య
వింత గనుగొని యెల్లరు వెఱగు పడఁగ.

అకలంక మయిన రీతిని
ప్రకటిత మైనట్టి వాని ప్రజ్ఞకు మది నో
డక శిల్పాచార్యుఁడు మె
చ్చికొనెన్ 'భళిరా ! సెబాసు ! సెబా'సనుచున్.

కౌగిలించి కొనియె గాఢంబుగా వాని
శిరము మూరు కొనియెఁ జేయినొక్కెఁ
గనులు మూసి పుత్రగాత్ర పరిష్వంగ
సుఖము ననుభవించె సుకృతి యపుడు.

ఇతఁడు మదీయ పుత్రకుని ఈడుగలాఁడె యెవండొ సత్కళా
చతురుఁడు వీనిఁజూడ మది సందియమౌ నిజవృత్తమీతఁడే
కతమున దెల్ప నొల్లఁడొకో! కాని మొగంబును జూడ జూడ మ
త్సుతుని మనోహరస్మృతులు చుమ్మలు చుట్టు హృదంతరంబునన్.

పూవునకుఁ దావియును, ఫలమ్మునకుఁ దీపి
కలుగుటకు మూలకారణం బొలయు నెదియొ !
సకల విద్యలకును గురుసంప్రదాయ
మొక్కటే కాదు తన్మూలమునందు నొకటి.

మన కెవ్వరికిని దోపని
పని మెలకువ తోచె, వీని ప్రతిభకు జేజే
ఘనవిజయంబిది శిల్పుల
కును, మన కేల జనియించునో దలవంపుల్ ?

రాజుల మన్ననల్ వడసి రాజిలుచుండి ప్రశాంతచిత్తులై
యోజన చేయుచున్న యెడ నొక్కక్షణాన స్ఫురించునెద్దియో
ఓజఁ గళా ప్రవీణులగు నోజులు వ్యాకుల చిత్తులై నృప
వ్యాజమునన్ భయంపడిన వారలు యోజన సేయ నేర్తురే ?

మన పంచాణము వారిలో నొకఁడు ధీమంతుం డుపాయంబుతో
మన మెవ్వారముఁ జేయలేని పని సంభావించి కావించె నీ
ఘనకార్యంబు సమస్త శిల్పి జన విఖ్యాతంబుగా వహ్వారే
యనుచున్ బ్రహ్మరథంబు పట్టవలె సమ్యగ్దృష్టితో వీనికిన్.

ఏ స్థపతి వర్యు తనయుండో యతండు కాక
బుద్ధికుశలత యీరీతి పొదలునెట్లు ?
ఏ మహాశిల్పి శిష్యుండో యతండు కాక
ఇట్టి ప్రజ్ఞా విశేషమ్ము లెట్టులబ్బు ?

పలువురు వాని ప్రజ్ఞకు సెబాసని మెచ్చిరి గాని కొందఱు ల్పులు సయిరింప లేక పొలిపోకc గలంగుచు దుష్టచిత్తులై పొలపొల పొక్క చావలికి పోయిరి, మోములు వాంచి ప్రక్క చూపుల యువశిల్పిపైని విసమున్ వెళ్ళగక్కుచు లోన స్రుక్కుచున్.

మంచి మనసుతోడ మర్యాదపాటించి
స్థపతి వర్యుండిట్లు లనుచునుండ
తామసంబు తోడ తక్కిన శిల్పులు
తలచిరిట్లు లెదలు తల్లడిల్ల.

ఎవడీ శిల్పి కుమారకుండిపు డింతం డిట్లేల వచ్చెన్ మహో పవిపోలెన్ మన పాలి కాలగతుండై ! ప్రాగల్భ్యముం జూపి యీ రవిధామంబు పయిన్ మహాకలశ మ్రశాంతంబుగా నిల్పి పెంపువహించెన్; మనబోంట్ల కెల్లc దలవంపుల్ దెచ్చె నిప్పట్టునన్.

ఈ రహస్యము నృపమంత్రి యెఱిగెనేని
కుటిల వర్తనుc డొప్పక క్రుద్ధుడగుచు
మనలనెల్లc గారాగారమునన నిలుపుc
బదియు రెండేళ్ళ శ్రమకిది ఫలము మనకు.

మీరలు శిల్పులు గాకో
వారక పెఱవాఁడ్లోకందు వన్నెలు దిద్దన్
బౌరుషము లేక యుందురె
భూరి యశుల్ పౌరుషేయ భూసురులెందున్.

ఒక చమత్కార మొనరించి యుత్కల క్షి
తీంద్ర సమ్మాన మొందునే ఈ యువకుఁడు
ఇది యసంభవ మీకార్యమెట్లు జరుగు
నిట కళాకార దిగ్దంతు లిందఱుండ ! ?

కావున వీని కారణముగా మనమెల్లర మిప్పుడీ కళా
జీవనమున్ ద్యజించుచుఁ గృశింపవలెన్ జెఱసాలలోపలన్;
బోవు సమస్త పాపములు పుణ్యముగల్గును రామచండికా
దేవికి రాత్రి వీని బలిదీసిన మేలగునెల్ల వారికిన్.



# ధర్మపదుని ప్రాణత్యాగము - విశుశాపము

ఆ శిల్పులెల్లర యాలోచనంబు
నెదలోన తర్కించి యెలనవ్వు నవ్వి
సఖుడగు రాజీవు సముఖాన కేగి
త్యాగశీలుడు పల్కె ధర్మపదుండు.

కౌశలమ్ము జూపగా లేక కుందెడి
శిల్పివరులఁ జూచి చింతఁ జెంది
మేలొనర్చి నట్టి మిత్రుని జంపగ
జూతురే ! యిదేమి చోద్యమకట !

బాలుని శాస్త్రకోవిదుని భవ్యమనస్కు మనోజ్ఞ సూర్య దే
వాలయ శిల్పకర్మ ప్రతిభామతి సాయమొనర్చినట్టి ధీ
శాలిని పాపమంచనక చంపదలంతురె మిత్రులక్కటా !
కాలము దీరినన్ బ్రతుకగా గలవాడెవడుండు నీధరన్.

పదిరెండేళ్ళు పరిశ్రమించి సులభోపాయంబు గన్పట్ట కా
పదలో జిక్కిన శిల్పులందనుపగాఁ బద్మోపలం బెట్టులో
గుదురన్ జేసితి శ్రీ విమాన శిఖర క్రోడంబులో నేర్పుతో
నిది సాధర్మ్యముగా దలంచితిని గానీ ! వీరలిట్లెంతురే ?

చెలిమిని బలిమిని దలపక
కలవరపడి, రామచండికాదేవికి పూ
జలు సల్పి మ్రొక్కు తటినన్
బలి యిచ్చిన - అది మదీయ భాగ్యము కాదే ?

కనలకుఁడన్న ఘోరకలి ఘాతుక చర్యకుఁ బూనుకొన్న మి
మ్మనిశము బాధపెట్టునది, యయ్యఘ మందఁగనేల ? యేరికిన్
గనబడకుండఁ బోయెదను గాక భవత్ రచనాను రక్తికిన్
జనపతి పూజలందుకొని శాశ్వతకీర్తి గడింపుఁడీరలే.

కలశంబిమ్ముగ నిల్పినాడనని కక్షన్ బూని నాపైని కొం
దల మందంబనిలేదు; మీకొఱకుఁ బ్రాణత్యాగమున్ జేసియేన్
ఫలితం బీరలె పొందునట్లు కరుణింపన్ సూర్యుబ్రార్థింతు నా
కు లభించున్ బరలోక సౌఖ్యములు మీకున్ గల్గు సన్మానముల్.

జనకుడు శిల్పశాస్త్రనిధి సత్యమెఱుంగడు, నేను మ్రొక్కినన్
దనివిగ నామెయిన్ నిమిరె ! దానిపుడీ విపరీత దుఃఖ భా
జనుఁడు నదృష్టహీనుడు నిజంబుగఁ దత్ప్రియ సూనుఁడన్న వా
ర్తను విని యంతరంగమునఁ దల్లడమందఁడె క్రుంగఁడే వ్యథన్.

ఘనముగ సూర్యమందిర మఖండ కళాకృతిగా రచించఁ బూ
నొకని పిత [illegible] జనుల్ సర్వస్వము ధారవోసి పెం
చిన జనస్థలల్లాడ యెటు [illegible] మదిన్ తనూజు డీ
వనధిని [illegible] బడిన వార్త విన్నచో ?

దేవళముల్ రచించు పతిదేవుడు ద్రోహములం జరించుచో
చేవదొలంగి నాకొఱకు చింతలవంతల మున్గి తేలుచున్
జీవితమున్ వెలార్చు దృఢచిత్తముతో నను గన్నతల్లి రా
జీవసఖా ! యెటుల్ తెలిపి జీవము నిల్పెదొ మాతృమూర్తికిన్.

నను విడనాడి పోవఁదగునా యని గన్నులనీరు నించె, నా
జనకుని దోడి తెత్తునన సమ్మతి దెల్పె నదృష్టహీన మా
జ్జననికి నా నమస్కృతులు సాంత్వనముల్ వచియించి, మాపయిన్
గనికరముంచి మామెనొకకంట సదా కనిపెట్టి యుండుమా !

నను మన్నింపుము తండ్రి - నాదయిన ప్రశ్నన్ జూపి విశ్రాంత చి
త్తుని గావింపదలంచి నా చరిత నీతో జెప్పనైతిన్, మహా
జన మధ్యంబున ఉత్కృష్టప్రభు పూజాకార ప్రకాశన్ నినున్
గని మోదంబున తల్లికిన్ దెలుపగా గాంక్షించితిన్ నా మదిన్.

అగ్రభాగంబు తెలుపు మధ్యమ్ము నలుపు
మేలుకట్టుగఁ గొడకట్టు మేఘమాల
పశ్చిమ దిశాభిముఖముగాఁ బరిఢవిల్లెఁ
బరమ పద భవ్యసోపాన పంక్తివోలె.

కప్పలు బెకబెక లాడెను
సప్పంబులు వెలికివచ్చె సంరంభముతో
గుప్పున నుసుళ్ళు లేచెను
దప్పదు జడివాన నేటి తామసరాత్రిన్.

పులుగులు సద్దుసేయక సమూహములై కుజకోటరంబులన్
నిలిచె, సముద్రగర్భమతి నిశ్చలతన్ గనె, నాకసంబునన్
జలనము లేక స్తబ్ధముగ సాగె మరుద్గణ మింక నెప్పుడే
ప్రలయము వచ్చునో తెలియవచ్చునె ? యుత్కళల తీరభూమిపై.

తనయుని గానక సంభ్రమ
మున రోయుచు వార్ధి తీరమున చీకట్లన్
ఘనుడగు శిల్పాచార్యుడు
మన మెటియగ తిరుగజొచ్చె మతిచెడినట్లై.

నా కుమారు డతండు నా నయనతార
కలశమామలకమ్ముపై నిలిపె నౌర !
యేల యజ్ఞాతముగ నుండె నిన్నినాళ్ళు
గత దురిత మంధ తమసమై కనులగ్రమ్మె.

అనుమానం బొక యించుకంత గలిగెన్ యాదృచ్ఛికాలక్ష్య ద
ర్శనవేళన్ సుతుడేల డాచె నిజమున్ రాజీవ ! నీవైన నా
దినమే తెల్పవదేల ? వృద్ధునిటులన్ దీవ్ర వ్యధన్ ద్రోచి యే
ఘనతం గాంతువొ నీవు - దుర్విధినమున్ గాటించె నీరీతిగన్.

ఎటువోయెన్ కొమరుండు, ధర్మపదుడీ హేరాల తామ్రస సం
కటమందే మయినాఁడో ? స్వామి ! యని యర్కక్షేత్రమందెల్ల ది
క్తటముల్ పిక్కటిలంగఁ గేకలిడుచున్ దైన్యంబుగా దైవ దు
ర్ఘటనన్ గూర్చి పొకాలు చుంజనియెఁ బారావార తీరంబునన్.

కంపిత గాత్రుఁడై స్థపతిఁ గర్కశ వాక్కుల పల్కె "నెంతయున్
దెంపరినై సతీసుతుల దిక్కుఁ గనుంగొన కిన్నినాళ్ళిటన్
సొంపుగఁ జేసితిన్ సకలశోభ దివాకర దేవళమ్ము-భూ
కంపము వచ్చి వ్రయ్యలగు గాక సమస్తము నాశనంబుగా"

దేవళము పూర్తిచేసిన ధీయుతుండు
అనఘుఁ డాగమశిల్ప రహస్య విదుడు
నా సుతుడు లేని నాకు ప్రాణమ్ములేల
దివ్యశిల్పములేల మందిరమదేల ?

ఒక్కపరి భూమి కంపించె నుదధి పొంగె
నగ్ని వర్షించె నాకసంబదిరె, గాడ్పు
దశదిశలు వీచెఁ బంచభూతములు గదలె
సుతుఁడు బితరుండు నిరులలో సురిగిపోవ !!

ప్రమతి భ్రమజెంది యాక్రందనముల తోడ
విశుమహారాణ తనయుని వెదకి కొనుచు
తన వయిపె వచ్చుచుంట రత్నాకరుండు
స్వాగతం బిచ్చె నూర్మిహస్తములతోడ.

తెల్లవారె జగంబెల్ల వెల్లఁబారె
స్థపతి గణముల కన్నులు చల్లఁబడియె
సూర్యదేవాలయము వంకఁ జూడ లేక
వెడలిపోయిరి వెఱపుతో వివశులగుచు.

ఏమి యీ ఘోరమని కనులెఱ్ఱఁ జేసి
యేడు గుఱ్ఱాల రథమెక్కి యినుఁడు వచ్చె
నుత్కలాంబుధి తీరమం దుష్ణరశ్మి
నిలయమరసి నిశ్చేష్టుఁడై నిలిచిపోయె.

